# చీకటి వెలుగులు

పీసపాటి శేషుబాబు





# చీకటి వెలుగులు

నాటకం

పిసపాటి శేషుబాబు

నవోదయ పబ్లిషర్స్
విజయవాడ 2

# అంకితం



సహృదయులు, నిరాడంబరులు, ఆదర్శ
మూర్తులు, మంచి నటులు అయిన
శ్రీ గుమ్మడి వేంకటేశ్వరరావుగారికి
ఆనందంతో ఇచ్చే అంకితం.

# నా మాట

నాటకం వ్రాయటం అతికష్టం అంటారు కొందరు. అది అన్ని విధాలా నిజం. నాటకానికి ఇతివృత్తం తీసుకోగానే, పాత్రలు వాటి ప్రవేశం, వాటి పోషణ అడుగడుక్కీ రచయితను అనేకచోట్ల ఇబ్బం దులు పెట్టిస్తాయి. కథ అయితే, సాధనసంపత్తి వర్ణన, భూత భవిష్య త్తులు మాటల్లో వెనుకముందులకి జరపవచ్చు. నాటకం విధానమే వేరు.

ఇటువంటి ఇబ్బందులతో కూడిన పని నేను ప్రయత్నించాను. ఈ నాటకం వ్రాయగానే నా మిత్రుడు శ్రీ కె. శ్రీహరిమూర్తి చదివి, కొంత ఉత్సాహంతో నటరాజ కళాసమితి ద్వారా ప్రదర్శించాడు. అతను నాటకంలోని ప్రదర్శనద్వారా లోపాలు దగ్గరుండి నా చేత మార్పులు చేయించాడు. ఆ తర్వాత శ్రీ యం. వి. చలపతిరావు (రైల్వే ఇన్స్టి ట్యూట్ సెక్రటరీ) గారు ఈ నాటకాన్ని మరికొంత కొత్త పుంతలు తొక్కింప చేసే విధానంలో నాచేత రంగానికి అనుగుణంగా మార్పిడి చేయించి ఈ నాటకాన్ని నర్సాపురం కళాపరిషత్తుకి, ఆంధ్ర నాటక కళా పరిషత్తుకి ఇచ్చారు. ఈ ఇద్దరి మిత్రుల సహాయంతో ఈ నాటకానికి ఒక రూపం ఏర్పడింది. వారికి సర్వదా నా కృతజ్ఞతలు.

ఇందు రచనలోగల లోపాలు పెద్దలు, సాహితీపరులు తెలియ పర్చిన చాలా ఆనందిస్తాను.

ఏ పాత్రనయినా సునాయాసంగా అర్థంచేసుకొని, పాత్రలో ఇమిడి ప్రేక్షకులను ముగ్ధుల్నిచేసే ఫంకిమి కల వ్యక్తి శ్రీ గుమ్మడి వేంకటేశ్వరరావు. ఆయనకి నటనమీద గల గౌరవం నన్నెంతో ఆయ నకి సన్నిహితం చేసిందనవచ్చు. అటువంటి సమర్థులకు మంచి నటులకు ఈ పుస్తకాన్ని అంకితం ఇచ్చి వారి ఆదర్శం నాకెల్ల ప్పుడు ముందుకు నిదర్శనం అవుతుందని ఆశ. అందుకే వారికి ఈ 'చీకటి - వెలుగు'లు అంకితం యిస్తాననగానే సంతోషంగా స్వీకరించి నందులకు నా కెంతో ఆనందాన్నిచ్చింది.

—పీసపాటి శేషుబాబు.

# పాత్రలు

డాక్టర్ మురళి : 32 సం॥ వయస్సు. నిప్పురుగప్పిన గంభీర స్వభావి. ఎంతటి అవాంతరమైనా తేలిగ్గా తీసుకొంటాడు. విశాల హృదయుడు. జీవితంలో కొన్నాళ్ళు చీకటిని భరిస్తాడు.

డాక్టర్ రమేష్ : మురళి స్నేహితుడు. వయస్సు 32 సం॥లు.

రవి : మురళి తమ్ముడు. 23 సంవత్సరాలు.

నాగభూషణం : మురళి తండ్రి. వయస్సు 55 సంవత్సరాలు.

వెంకన్న : నౌకరు. వయస్సు 50 సం॥లు నాగభూషణానికి కుడిభుజంలాంటివాడు.

రాధ : మురళిభార్య. అతన్ని ప్రేమించి పెళ్ళి చేసుకొని అవమానాలుభరించి, జీవితంలో వెలుగు బాటను నిర్మించు కొంటుంది. వయస్సు 25 సంవత్సరాలు.

---

ఈ నాటకాన్ని ప్రదర్శించ గోరువారు ముందుగా రచయితకు తెలియజేయ వలెను.

అడ్రసు :
సీతాఫలమండి,
సికిందరాబాదు.

# 1 వ రంగం

[తెర లేచేసరికి స్టేజిలో వెంకన్న కుర్చీలూ అవీ సర్దుతూ ఉంటాడు. స్టేజి అంతా Modern పద్ధతిలో ఉంటుంది సోఫా సెట్టూ, సోఫాకి ఆనుకొని రెండు కుర్చీలూ, స్టేజి కెదురుగా గుమ్మం. గుమ్మం ప్రక్కనే మేడమీదకి మెట్లు. మేడమెట్లు ప్రస్ఫుటంగా కనబడాలి. Book-Self ఎత్తయినస్టూలు, దీని పైన డాక్టర్స్ సరంజామా - మరోప్రక్క కోటు హాంగర్స్ దీనిపైన స్టెతస్కోపు వేళ్ళాడుతూ ఉంటుంది. సమయం సాయంత్రం 4 గం॥ నేపథ్యంలో శ్రావ్యమైన సంగీతం. మరో ప్రక్కనుంచి ఎవరో అటూ, ఇటూ హడావిడిగా తిరుగుతున్న అడుగుల సవ్వడి వినిపిస్తుండగా బయటనుంచి రవి వస్తో పిలుస్తాడు.]

రవి : (విసురుగా ప్రవేశించి) వెంకన్నా! వెంకన్నా!

వెంకన్న : ఏం చినబాబూ ?

రవి : కాఫీ కావాలి? చాలా అర్జంటుగా కావాలి.

వెంక: ఎక్కడికి కెడుతున్నారు చినబాబూ ?

రవి : మట్టిబుఱ్ఱా నువ్వూను...... ఎక్కడికంటావేమిటి? జడ్జీగారింటికి పార్టీకి వెళ్ళక్కర్లే ?

వెంక: ఎవరితో? (నవ్వుకుంటూ)

రవి : అన్నయ్యా వదినా మనమూ కలిసి.

వెంక: ఎల్లాల్సిందేనా బాబూ ?

రవి : అదేమిటి ? ఇక్కడయితే, అంటే ఇండియాలో పార్టీలూ, పిక్నిక్‌లూ తక్కువగాని అదే అమెరికా అయితేనా ?

వెంక: ఓసబ్బో! అక్కడిదాకా ఎల్లారే చినబాబు!

రవి : నీకు తెలియదులే....అంతా ఉంది. ఎప్పటికయినా వెళ్ళానే అనుకో.

వెంక: నన్ను ఎంటతీసుకుపోరాదు బాబూ ?

రవి : ఇదొకటా... పోనీ నా బదులు నువ్వే వెళ్ళరాదూ బాగుంటుంది.

వెంక: అల్లాగే ఎడతాలెండి... అన్నా, వదినాకూడా ఎల్లారుగా... మీరు ఇంటిపట్టున ఉండండి.

రవి : (తెల్లబోయి) ఏమిటీ ?

వెంక: నీ కోసం సూసిసూసి ఎల్లిపోయారుగా అరు.

రవి : వెళ్లారా! (కోపంగా)

వెంక: మరేంది సేస్తారు. మీది అమెరికా టయిమెరి.

రవి : సంతోషించాం నీ తెలివిక ?

వెంక: ఏంటి బ బూ !

రవి : మరేం చెయ్యమంటావ్! నేనూ వస్తానని చెప్పినా వెళ్ళారంటే?

వెంక: మీారయితే ఏడకెళ్లారో చెప్పరాయె. మీా రొచ్చే దాకా ఈడకూకుంటే మీా అన్నగారు తొందర పడ్తున్నారాయె. అందుకని.

రవి : అవును. ఆయనకి నాధ్యాస అవసరమయితేగా, అన్నింటికీ ఆవిడగారే ఉన్నారు

వెంక: కాదు బాబూ ?

రవి : పై మెరుగు మాటలు చాల్లే వెంకన్నా! నీ దాప రికాలు సర్దుబాట్లూనాకు తెలుసు.

వెంక: నిజం ...నే సెప్పింది నిజం బాబూ ?

రవి : అబద్ధం ఆడినా నష్టం తక్కువేలే. అందరికీ ఇదో రకం సరదా నాతో ఏదో చెప్పి వప్పించడం.

వెంక: చిన్నపిల్లాడివి కదూ!...అందుకని.

రవి : చంటిపాపని కదూ. ఉయ్యాలలో వేసి ఊపుదువు గానిలే.

వెంక: ఓ! తప్పకుండా !

రవి : కాస్త ఆగు. అసలు వదిన వచ్చాక అందరిలో అదోరకరకం మార్పువచ్చింది.

వెంక: మరేనయ్యా! ఆ అమ్మ ఇంట్లో తిరిగితే చాలు వెయ్యి వరహాలకాంతి కదయ్యా!

రవి : (వ్యంగ్యంగా) ప్రొద్దుపోలేచి ఆవిడకి ప్రదక్షిణం చేస్తే సంపూర్తి అవుతుంది వెంకన్నా! అవ్వాయి

కబుర్లు చెప్పి ఒదినగార్ని కొండెక్కించింది నువ్వ్యా, నాన్నా కదూ !

వెంక: కబుర్లుకాదు ముమ్మాటికీ ఆవిడ మాలచ్మే.

రవి : అందుకే నాతో అన్యోన్యంగా ఉన్న మా అన్న య్యనుమంత్రించి నన్ను మరచిపోయేటట్లు చేస్తోంది. అస్తమానూ ఆవిడ కొలువే ఆయనకు.

వెంక: అవును బాబూ! అన్నయ్య, వదినా ఇంట్లోతిరిగాడితే చిలకా గోరింకల్లా ఉంటారు.

రవి : మాటిమాటికీ ఆవిడచేసే ఘనతలు చెప్పడంకన్న నీకేం పనిలేదా? నీబుద్ధి రోజు రోజుకి మందగిస్తోంది తాతా !

వెంక: మల్లీ అను సినబాబూ !

రవి : ఏమని ?

వెంక: తాతా! అని అనయ్యా!

రవి : అతుసార్లు అంటానుగాని, కాఫీ కాస్త పోస్తావా లేదా !

వెంక: వదినమ్మగోరు అట్టేపెట్టి ఎల్లారయ్యా !

రవి : ఇంకోసారి ఆవిడ్ని గూర్చి నా దగ్గర పొగిడావా ఊరుకోను.

వెంక: ఏం? ఎందుకని అంతకోపం సినబాబూ!

రవి : బుద్ధిలేక, అవసరం ఉన్నా లేకపోయినా వదినగారి ప్రసక్తి, కీర్తి లేనిమాట రాదే మీ కందరికీ ఆ చల్లనిపాదం ఏ రోజున ఈ ఇంట్లో అడుగుపెట్టిందో అంతే. అటుఅన్నయ్యా, ఇటునువ్వ్యా నాన్నా నాకు

దూరమయ్యారు. నన్నడిగే వాళ్ళు లేక దిక్కు లేక దూరమై వెళ్ళిన అమ్మకేసి చూస్తో కూర్చుంటు న్నాను తెలుసా ?

వెంక: బాబూ! రవయ్యా!

రవి : నా అవస్థ నీకు తెలియదు లే. వెళ్ళు నన్ను రెచ్చ గొట్టకు.

వెంక: (చిన్నబుచ్చుకొని) అల్లా కసురుకుంటారేం బాబూ. వెడతా ఇదిగో సిటికెలో వస్తాను కూర్చో బాబూ.

రవి : ఊ దయచేసి వెళ్ళు

వెంక: (వెళ్ళి తిరిగి కాఫీతో వచ్చి) ఇదిగో బాబూ. (అని వెళ్ళబోతాడు.)

రవి : వెంకన్నా! కోపం వచ్చిందా ?

వెంక: లేదు... బాబూ !

రవి : నాకు తెలియకుండా విసుగొస్తుంది. ఏదో అంటాను. వదిన తప్పు లేదంటావా ఇప్పుడు! నువ్వే చెప్పు.

వెంక: లేదు...మీ కోసం ఆ అమ్మ అల్లల్లాడి పోనాది బాబూ.

రవి : నాకు తెలుసు. ఆవిడ నన్ను ఆదరిస్తుంది కాని నాకు కోపం ఎందుకో వస్తుంది.

వెంక: అదే పోద్దిలెద్దురూ...వస్తా కాఫీ త్రాగండి. (వెడ తాడు)

రమే : (వస్తో) మురళీ !... మురళీ...

రవి : ఓహో ! మీరా రండి, కూర్చోండి.

రమే : అన్నయ్య లేడా ?

రవి : వదినతో వెళ్ళాడండీ!

రమే : లేకపోతే నీతో వెడతాడా వాడు...అది సరే ఎక్కడికి ?

రవి : నాతో వెళ్ళే రోజులు మారిపోయాయి లెండి.

రమే : మిస్టర్ రవీ! పెళ్ళయ్యాక నీతోనే కాదు వాడు నాతో కూడా అంతే.

రవి : పాపం మీరూ సంపాదిస్తేసరి ఒక తోడును.

రమే : చూద్దాం...వాళ్ళు ఎక్కడికి వెళ్ళారు.

రవి : టీ పార్టీకి.

రమే : ఈ మురళికి అసలు బుద్ధిలేదు. సాయంత్రం ఒక కేసు చూడ్డానికివెళ్లాలి రమ్మన్నాను.సరే అన్నాడు. వస్తే ఇదీ వాడు చేసింది.

రవి : Wait చేయుండి. వచ్చాక వెళ్ళుదురుగాని.

రమే : అంతే చేయాలి! ఎప్పుడొస్తాడో ఈమూగ దేముడు.

రవి : డాక్టరు గారూ. మా అన్నయ్య కాలేజీలో ఎక్కువ మాట్లాడేవాడే కాదండీ!

రమే : అబ్బే! మెడికల్ కాలేజీలో ఎక్కడ చూచినా మా ఇద్దరి Batch ఒక ప్రత్యేకత అయ్యింది. కొన్నాళ్ళకి మీవదినతో స్నేహమయ్యింది. అక్కడ నుంచి రాధా నేనూ చచ్చే అల్లరిచేసేవాళ్ళం. కాని మీవాడు ఒక మాటమాట్లాడేవాడుకాదు. అందరికీ వింతగా ఉండేది పెద్ది చూస్తే.

రవి : మా వదినతో మీకెల్లా పరిచయమయ్యింది ?

రమే : ఒక రోజున మీావదిన తాతగార్ని ఆస్పత్రికి తీసుకు వచ్చారు. అప్పుడు నేనే Treat చేశాను. ఆ తర్వాత మురళి కూడా పరిచయం చేశాను. మా స్నేహం చివరికి మీా వాడికి పెళ్ళయే దాకా వచ్చింది.

రవి : ముందు వదిన మీాకు తెలుసన్నమాట ?

రమే : తెలిస్తే ఏం లాభం బ్రదర్. మీా అన్నయ్య అసాధ్యుడు.

రవి : వదిన.

రమే : రాధని అర్థం చేసుకోవాలంటే మీా అన్నయ్యకి ఒక్కడికే తెలుసు.

రవి : అదేమిటి ?

రమే : అదే అర్థంకానిది. తలాతోకా లేని ఆవేశంలో అల్లరి చెయ్యడం తెలుసుగాని నేను మనుష్యుల్ని గుర్తించలేనేమో ?

రవి : అదీ ఒక ఆర్టంటరా ?

రమే : తప్పకుండా. రాధ అందరిలాంటి మనిషికాదు. అదొక తరహా !

రవి : మీారూ ప్రారంభించారు పొగడ్త. క్షమించండి నా ఉద్దేశం.

రమే : చెప్పు రవీ !

రవి : వ్యక్తికి అక్కర్లేని విలువ ఇవ్వడం విచిత్రం ?

రమే : రాధ సంగతా నువ్వనేది.

రవి : అవును.

రమే : లేదు రవీ! మీ వదిన మనస్సు తెలియక అంటు న్నావు.

రవి : రెండేళ్ళగా సహవాసం చాలదా !

రమే : కావచ్చు.

రవి : చదువుకున్నవాళ్ళు లేనివాళ్ళు ఒక్కలాగ మాట్లా డితే నవ్వొస్తోంది సారీ !

రమే : ఊరికే అనడంకాదు.

రవి : అదొకటా మధ్య.

రమే : నా కర్థంకాని విషయాలు చాలా ఉన్నాయి రవీ ! అందులో మీ వదిన,మురళీల మన స్తత్వాలు. నన్ను ఏ సంఘటనా జీవితంలో కదలించలేనంతగా ఒకసారి జరిగింది. అదే విచిత్రం. స్నేహమయ్యింది మొదట నాతో, పెళ్ళి చేసుకొన్నది మీఅన్నయ్యను రాధ! అందుకు నన్ను నేను చాలాసార్లు శోధించుకున్నాను కూడా. (నవ్వి) ఒకసారి నేనూ, మీ అన్నయ్యా పంతుకిపోయాం. రాధ పుట్టిన రోజు ఆవేళ. వాళ్ళ తాతగారు మంచంలో ఉన్నారు. తన ఆఖరిదశలో రాధ తన తర్వాత దిక్కులేనిది కాకుండా వరనిర్ణ యం జరగాలనుకొన్నారు. నిజం చెప్పాలంటే అప్ప టికి ఆయన ఒక నిర్ణయం చేసుకున్నారు. ఆనిర్ణయం రాధకు చెప్పారట కూడా. ఆ పంతాలమొగ్గు నాకే అనుకున్నాను. రాధతో నాకున్న చనువును బట్టి. అందుకే వాళ్ళ తాతగార్ని కలుసుకున్నాను. ఆయన చెప్పింది కూడా నాకే అనుకూలం.

రవి : ఏమండీ పంతాలన్నారు ఏమిటవి?

రమే : రాధను ఎవరు పెళ్ళిచేసుకుంటారా అని.... ఎవరిని చేసుకుంటుందా అని.

రవి : అవున్లెండి. మీకు అవకాశం ఎక్కువ ఉందిగా!

రమే : ఆ ఆశతో రాధను కలుసుకున్నాను.... కాని రాధ మనస్సు మరోలా ఊహిస్తో మధ్యలో మీ అన్నయ్యను తనకు దూరం కాకుండా చేసేభారం నా మీద పెట్టింది. ఆనాడు నాలో కలిగిన భావతరంగాలు, ఇప్పటికి మర్చిపోలేను. సంతోషంతో మీ అన్నయ్యను కలుసుకుని వాడిని ఉక్కిరి బిక్కిరి చేశాను. దెబ్బతో చిత్తయ్యాడు.

రవి : పాపం!

రమే : కాదు రవీ.. ఆనాటి సంతోషం నిరర్థంకాదు.

రవి : మరి మీరు ఓడిపోలేదా?

రమే : స్నేహంలో ఉన్న మమకారం అల్లాంటిది. వాణ్ని అర్థంచేసుకుంది. వాడిలోఉన్న మూగభావాలు, ఆత్మశక్తి తెల్సుకుంది. లోకంలో జరిగే ఏ సంఘటన మన స్థూలదృష్టికి అందిన చూపుమేరలో దాని స్వభావాన్ని నిర్ణయించకూడదులే అందుకే రాధ వాడిదయ్యింది. అందుకే నేను మెచ్చుకునేది కూడా.

రవి : మీ త్యాగం. అంతకంటే గొప్పదిలేదు.

2)

రమే : మురళితో స్నేహం ఒకరోజుది కాదు. చిన్నప్పటి నుంచీ కలిసి చదివాము, నీకు తెలుసు మేమిద్దరం నిన్ను ఎత్తుకుని ఆడించేవాళ్ళం. కలిసి అల్లరి చేసే వాళ్ళం, ఒకవ్యక్తిగా పెరిగాము. అలాంటి మురళిని అదృష్టం వరిస్తోందంటే నాకుకాకపోతే మరెవరికి చెప్పు.

రవి : నిజమే!

రమే : మీ వదిన చాలా మంచిది రవీ!

రవి : కాదంటేగా ఎవరయినా. అయినా అంతగా పొగి డేస్తే ఆతర్వాత ఆలోచించాలి.

రమే : అదేకాదు. ఆవిడ త్యాగం అంతకన్న ఇంకోటి ఉంది.

రవి : (ఇంతలో మురళి, రాధ నవ్వులు వినవస్తాయి) అదిగో వస్తున్నారు.

ముర : (వస్తూ) ఏరా! ఎంతసేపయ్యింది వచ్చి?

రమే : నీకేమయినా మతివుందా! ప్రొద్దుట ఒక కేసు చూడ్డానికి వెళ్ళాలన్నావా! టైఫాయిడ్ Patient Condition బాగులేదని చెప్పి నన్ను రమ్మన్నావు నువ్వెట్లాపోతే.

ముర : అరె....మరే....రాధా త్వరగా నా స్టెతస్కోపు.

రాధ : అల్లాగే....రవీ! ఎక్కడికెళ్ళావు. నీకోసం చూసి...

రవి : పోనీ పూరయినా వెళ్ళారుగా....మంచిది (అని విసురుగా వెడతాడు.)

రమే : నేను బయట కారులో వెయిట్ చేస్తూంటా, తర్వగా రారా! (వెడతాడు)

ముర : (రాధ ఇచ్చిన సైతస్కొపు తీసుకుంటూ) వెళ్ళనా?

రాధ : తప్పదుగా....

ముర : నిన్ను చూస్తోంటే కాలు కదపాలని.... ఆ గాలికి ఎగిరే ముంగురులు, ఆ కాటుక కళ్ళు.

రాధ : ఆపి వెళ్ళండి.

ముర : కాదు రాధా! నిన్ను తిరిగి ఈ మూడ్సులో చూస్తానో లేదో అనిపిస్తోంది. వస్తా(అని వెడతాడు. రాధ అతను వెళ్ళిన వైపే చూస్తోండగా వెంకన్న వస్తూ)

వెంక : అమ్మాయిగారూ!

రాధ : ........

వెంక : రాధమ్మగోరూ!

రాధ : (ఉలిక్కిపడి) ఆ.... ఏమిటి వెంకన్నా?

వెంక : అమ్మయ్యా! ఉలక్క పలక్కపోతేను.

రాధ : అబ్బే ఏదో ఆలోచనలోఉండి.

వెంక : అయితే వత్తా!

రాధ : ఎక్కడికి వెంకన్నా?

వెంక : అట్టా అట్టా తిరిగి మీా ఆలోసనలయ్యాక వత్తా.

రాధ : భలేవాడివి....ఇంతకీ ఎందుకు పిలిచావ్!

వెంక : ఏం లేదమ్మా! చిన్నయ్యగోరు మల్లెపూలు కోసుకురా వెంకన్నా అన్నారు ఇవిగో తెచ్చాను.

రాధ : ఇప్పుడా? ఆయన వెళ్ళిన తర్వాత.

వెంక : తిర్గి వచ్చాక ఇయ్యేండి. అమ్మాయిగోరూ దాని తన్నాదియ్యా ఈ ఏడు ఇరకాట్టసింది చెట్టు. అయ్య గారికివంటే మూలావు పాణంలెండి.

రాధ : నిజంగా?

వెంక : అమ్మగోరు పోయినాక నేనేగా తల్లి ఈ బాబుల్ని కనిపెట్టుకోని ఉన్నది. పెదబాబుగారిది చాలా సల్లని మనసమ్మా! బెంబేలుపడి బాబులిద్దర్ని నా కప్పసెప్పారు.

రాధ : మరి మీ చిన్నయ్యగార్కి ఆ పువ్వులంటే ఎందు కంత ఇష్టం?

వెంక : అమ్మగారిమీద అభిమానం తల్లీ. ఆ తల్లే ఈ చెట్టు నాటింది. కాని....ఆమె అనుభవించ లేక పోయింది. ఇప్పటికీ ఆ అమ్మ ఫోటోతో ఏటేటో సెప్తాంటాడు చిన్నయ్య.

రాధ : పాపం!

వెంక : అదే కాదమ్మా! రవిబాబుకి అన్న, తండ్రి తల్లి తనే అయ్యి పెంచాడు. రవయ్య అంటే మురళి అయ్యకి పానం అమ్మా!

రాధ : వెంకన్నా! ఇదంతా విచిత్రం కాదూ?

వెంక : ఏటితల్లీ?

రాధ : ఎవరితో తిరగాలన్నా బిడియపడేదాన్ని రమేష్ ద్వారా ఈయనతో కూడా స్నేహం. ఆ తర్వాత అందరిక్కీ విచిత్రంగా యీ ఇంట్లో....

వెంక : అవునమ్మా!

రాధ : రమేష్ ఎప్పుడూ గిల్లికజ్జాలు, అల్లరిచేష్టలు. ఈయన మాత్రం గుళ్ళో దేవుడిలా మూగనోము. కాని ఇప్పుడో.

వెంక : అవునమ్మా! భలే మారిపోనారు తల్లీ. పెద్దయ్య గోరు మాత్రం మిమ్మల్ని ఊరికే మాతల్లి, మా యింటి దీపం అని మాలావు మురిసిపోత్తారమ్మా! అమ్మా ఆరోజులు తల్సుకుంటే, అయ్యగారి యాపారం కిందమీదవడం, అట్టయిపోయినందుకు ఏం నేకపోయినా మురళయ్య సదువెట్టాగా అని బెంబేలు పడిపోయినారమ్మా ! అట్టాంటిది .... మురళిబాబు సేతులో సెయ్యేసి డాకటేరు సేసినారు. నేకపోతే ఏటయ్యేదో?....

రాధ : నాకి అదృష్టం పట్టేదికాదు.

వెంక : మాదా, మీదా రాధమ్మా అదృష్టం.

రాధ : ఇంతమంది చల్లని చూపులమధ్య నిలిచే అదృష్టం కలగడం నా అదృష్టం కాదూ?

వెంక : ఎయ్యేళ్ళు బతకమ్మా !

[నాగభూషణం ప్రవేశిస్తో]

నాగ : (కంఖువా ఇస్తో) ఏమిటాని అది?

వెంక : ఏంనేను బాబూ! గడసినరోజుల గాధలు నెమరేసుకుంటున్నామ్!

నాగ : ఎవరూ. నువ్వా .... రాధా?

వెంక : ఇద్దరమూను.

నాగ : బాగుంది అమ్మాయి. వీడికి తనలో తను మాట్లాడు కోడం అలవాటు ఇక ఇప్పుడు నువ్వు దొరికావు వీడి కబుర్లు వినడాన్కి.

రాధ : (నవ్వుకుంటుంది)

వెంక : ఒల్లమాలి అంటారు కాని.... మీ అలవాటే కదండీ నాకూ పట్టింది.

నాగ : ఏమిట్రా నా అలవాటు.

వెంక : అదేనండి! మీలోమీరు గొనుక్కోడం.

నాగ : ఓరి నీదుంపదెంచా ! నేనా.

వెంక : అవునయ్యా. ఆ రోజులలో యాపారం కింద మీాద యినపుడు మీాలో మీారు ఏదో గొనుక్కుంటూ కుమిలిపొయ్యేవారు కందా. నేనేం అడిగినా ఒక్క టయినా సెప్పేవారా. ఒక్కొక్కప్పుడు మీాకు గాని పిచ్చిపట్టిందా అనుకొనేవాడ్ని.

నాగ : ఓ....అదా. అవున్రా నువ్వుగాని కనిపెట్టుకొని ఉండకపోతే అంతపనీ జరిగేదే! చూడమ్మా రాధా కాలప్రవాహంలో ఎన్ని విపరీతమయిన మార్పులో అంతెందుకు నా ఒక్క జీవితాన్ని తీసుకోరాదూ, ఎటూగాని వయస్సులో భార్యావియోగం, దానికి తోడు తెలిసీ తెలియని వయస్సొకటి. పాలయినా వదలని పసిపాపొకడు. ఎలా ఉంటుందోకూడా ఊహించుకోలేను ఆ రోజుల్లోని నావ్యధ. అయినా మొండిగా గుండె బండ చేసుకొని బ్రతుకుతూ వచ్చాను. ఈ వెంకన్న ఆసరాతో వాళ్ళిద్దర్ని

ఒక తోవలోకి తీసుకురాగలిగాను. అంతవరకూ అదొకదశ. తరువాత మరి ఏడాదిలో మురళి డాక్టరయి నా చేతికి అందివస్తాడు. నా వ్యాపారాన్ని కట్టిపెట్టి వాడిచేతుల్లో తృప్తిగా రామా కృష్ణా అంటూ కాలం వెళ్ళమార్చవచ్చని ఊహాసౌధాలు కట్టుకొన్నాను. కాని ఎన్నడూ కలలోకూడా తలచని విధంగా వ్యాపారం తారుమారయ్యింది. ఒడ్డుకు చేరుకుంటున్న నావ హఠాత్తుగా ప్రళయఝంఝూమారుతం తాకిడికి తలక్రిందులయినట్లయ్యింది. ఎటు చూచినా అంతుతోచని జీవితసాగర అగాధం. అందుకుతోడు అంతవరకూ అసూయపడే సన్నిహితులు. అప్పటివరకూ తమలో దాచిన పైపై మెరుగులు, తియ్యతియ్యని కబుర్లు మాని, నిజరూపాల్లో వికటాట్టహాసాలు విసిరారు. వాడు చదివిన చదువంతా ఎందుకూ కొరకాకుండా పోతోంది. వాడికి ఈ పరిస్థితి తెలియగానే ఇంటికి చేరాడు. నాతో ఏమీ చెప్పకుండా తన చదువు ఆపేస్తున్నట్లు రమేష్ కూడా రాశాడు. ఎక్కడయినా అప్పు అడుగుదామంటే నష్టపోయిన ఆస్థిపరుడంటే అందరికీ చులకనే. ఇన్ని ఆలోచనలు నన్నొక పిచ్చివాణ్ణిగా చేశాయి. నిరాశలో నికృష్టపు ఆలోచనలు ఎన్నెన్నో నన్ను వేధించి.... వేధించి కృంగదీసేవి. ఏమిటో ఇప్పుడు తల్చుకోడానికే భయం వేస్తోంది.

రాధ : అవును. ఆరోజు ఉత్తరం రాగానే రమేష్ నా దగ్గరకి పరిగెత్తుకువచ్చి సంగతి చెప్పాడు. వారు చదువు మానేస్తారనగానే ....రమేష్ నేనూ బయలుదేరాం ఇక్కడికి. వచ్చి ఆయనన్నోటంట విని నమ్మలేక పోయాం. నాలో ఆందోళన కల్గింది. వెంటనే తాతయ్యతో ట్రంక్ కాల్‌లో మాట్లాడేను.నా అదృష్టం బాగుండి మా పెళ్ళికి తాతయ్య ఆనందంగా ఒప్పుకొన్నారు.

నాగ : నిజమే. వాడు అన్నంతపనీ చేసేవాడే. వాడి నిరయాలు ఎప్పుడూ అంతే. నాలో నేను కుమిలిపోతుంటే వాడుమాత్రం నిశ్చలంగా ఏమనేవాడో తెలుసా 'కష్టసుఖాల కలయిక లేందే జీవితానుభూతి ఏముంది నాన్నా' అనేవాడు.

వెంక : ఏమైనా ఇదంతా రాధమ్మసూపిన ఎలుగే బాబూ. మనపాలిట భాగ్యలక్ష్మి.

నాగ : లక్ష్మిని వెంటబెట్టుకొని ఈ ఇంటి కోడలయిన నీ త్యాగం....

రాధ : త్యాగంకాదు మామయ్యా! స్వార్థమే. ఆనాడలా జరక్కపోతే నా కోరిక గగనకుసుమంగానే ఉండేదేమో ఎవరు చూడొచ్చారు.

వెంక : ఓ! ఇది మాసెడ్డ బాగుంది. మీరంటే మీరని ఏటో ఈ గొప్పలు. అసలు సిన్నయ్యగారిది మగసిరి జాతకం.

రాధ : మంచివాడివే వెంకన్నా. (అని నవ్వుతుంటుండగా ఫోను మ్రోగుతుంది. నాగభూషణం ఫోను అందుకుని)

నాగ : హల్లో.... నాగభూషణం మాట్లాడేది. (షాక్ తీలయి) ఏమిటీ.... ఆ.... ఆ.... ఆగండి. అమ్మాయి రాధా! రాధా.... త్వరగా (రాధకి ఫోను ఇచ్చి) చూడమ్మా రాధా ఏమిటో! (పిచ్చిపట్టిన వాడిలా కలయ తిరుగుతాడు)

రాధ : హల్లో....ఎవరండీ .. ఆ.... ఏమిటీ ...ఏక్సిడెంటా. ఎవరికీ (వెర్రిగా) మామయ్యా. (అని ఫోను చేతిలోనుండి జారిపోతుంది. వెర్రికేక పెట్టి పడిపోతుంది)

— తెర —

కి)

## 2 వరంగం

## [రంగం మామూలే]

[సన్నని విషాదమయిన సంగీతం వినిపిస్తోంటుంది. తెర లేచిన వెంటనే మురళి మధ్యగది గుమ్మంకేసి తిరిగి సోఫానానుకొని ఉంటాడు. రాధ మెడదిగివస్తూ అతన్ని చూస్తో విచారంగా కళ్ళు తుడుచుకుంటూ దగ్గరికివచ్చి]

రాధ : ఎందుకండీ అలాకుమిలిపోతారు. జరిగిపోయినదాన్ని గురించి బాధపడితే ప్రయోజనమేముంది చెప్పండి.

ముర : జరిగినదాన్ని గురించి ఆలోచించడంలేదు రాధా! భవిష్యత్తుగురించే ఆలోచన. నా కళ్ళుపోయాయనే బాధకూడా లేదు. ఇంతమందిని బాధపెడుతూకూడా ఎందుకు బ్రతికున్నానా అనే బాధ.

రాధ : చూడండి...నాకు ధైర్యం చెప్పవలసిన మీరే ఇలా అయితే. ..

ముర : నీకు ధైర్యం చెప్పాలా! ఏమని...తనకోసం అపారమయిన త్యాగంచేసిన అర్ధాంగి, జీవితంలో నిప్పులు పోసిన నిర్భాగ్యుడు చిరంజీవిగా బ్రతికివుంటాడనా.

(ఏడుస్తుంది రాధ) ఎండి మోడువారిన ఆమె జీవిత కుసుమం, అతని సపర్యల చితిలో కాల్చి ఇంకా దాహం తీర్చుకుంటాడనా?

(ఒక్కసారిగా అతన్ని పట్టుకొని బాధలో కూడిన ఆవేదనతో)

రాధ : ఏమండీ అంతమాటనకండి. బూను తప్పకుండా చూపు తిరిగి వస్తుందండీ

ముర : నాకుమాత్రం రావాలని లేదూ .. కానిడాక్టర్లు ... (లాభం లేదని తలూపుతాడు)

రాధ : మనకంటె తెలిసిన వారు అవునంటున్నారు.

ముర : ఏమో రాధా! నాకు మనస్సులో వచ్చిన చీకటి భీకరమయిన భయాన్ని, అంతులేని ఆవేదనలనూ కల్గిస్తో, ఏదో కానరాని భయంకరమైన అగాధంలో పడిపోయినట్లనిపిస్తోంది. రోజూ కళ్ళముందు కనపడే రూపాలు, కటిక చీకటిలో మసగ మసగ్గా గుర్తుకు తెస్తో మతి చెలిస్తోంది.

రాధ : (భయంగా) ఏమండీ!

ముర : అందాన్ని, ఆనందాన్ని, రూపాన్ని కొలిచే కళ్ళే లేకుండా పోయాక, పనికిరాని ప్రయోజనం లేని నేను ఏం కావాలి ...

రాధ : నాకోసం మీరు ఏదీ కాకూడదు.

ముర : ప్రయోజనం లేని నేను ...

రాధ : కొందరు అందరిలా కాకుండా ఏదో ఒక లోపంతో వున్నవాళ్ళు లేరా? వాళ్ళంతా దేశానికి ప్రయోజనం లేకుండా పోతున్నారా? మీకు ఒక

రికి చెప్పే జ్ఞానం ఉంది. విజ్ఞానం వెదజల్లి మాబోటి వాళ్ళను విజ్ఞానవంతుల్ని చేయండి.

ముర : ఎవరికి నేను చెప్పాలి. నీకా..నన్నూ, నా జీవితాన్ని పూర్తిగా నీది చేసుకున్న నీకేం చెప్పగలను. కాని నాన్న...నాన్న... నాన్నకేం చెప్పాలి ఆయన్నెలా అనునయించాలి. నన్ను రవిని కళ్ళల్లో పెట్టుకొని పెంచిన నాన్న కళ్ళే ఈనాడు నేను పొడిచింది. అంతేకాని నావికావు.

రాధ : (బాధను ఆపుకోలేక వెక్కి వెక్కి ఏడుస్తుంది)

ముర : ఏడ్చి లాభంలేదు రాధా! నాన్నలాగ ఇప్పటినుంచి గుండె రాయి చేసుకోవాలి.

రాధ : వారి ఆవేదన అంతులేకుండా ఉంది.

ముర : మరి రవి?

రాధ : అతనా! అతనయితే పిచ్చిపట్టినవాడిలా ఎక్కడెక్కడో తిరిగి ఇష్టమైతే ఇంటికి వస్తాడు. వచ్చినా తిండి ధ్యాసే ఉండదు. మీకేసి అదోలా చూస్తాడు. ఈ సంఘటన జరిగినప్పటినుంచీ నన్నుచూస్తే మరీ మండిపోతున్నాడు. ఎవరితో చెప్పుకోలేని మూగ బాధ అతనిది.

మురి : అవునురాధా! నాగురించి ఇంతమంది ఇలా కుళ్ళి పోతూకూడా నాకీ సేవలు....

రాధ : అదేమిటండీ. మీరు మా కళ్ళల్లో కనుపాపకదా.

ముర : కాని నాకంటిలో పాప....

రాధ : (మాట మారుస్తూ) ఏమండీ! నిన్న రమేష్ ఏమి టండీ ఏదో జెనర్జీ అంటున్నాడు.

ముర : వాడికో వెర్రిఆశ కలకత్తా కళ్ళజబ్బుల స్పెషలిష్టుకి వ్రాశాడట. నాకు నవ్వొచ్చింది.

రాధ : నిజంగా ఈసారి మంచి వార్త రావాలి.

ముర : నీ కలలు ఫలించేమార్గం కలలోనే దొరుకుతుంది.

రాధ : కాదు.

[నాగభూషణం ప్రవేశం]

నాగభూషణం : ఈపూట ఎలావుంది నాయనా?

ముర : బాగానేవుంది నాన్నా! ఇవ్వాళే Bandage తెస్తా నన్నాడు.

నాగ : రమేష్ ఋణం ఎలా తీర్చుకుంటామో?

ముర : మరే నాన్నా! వాడెప్పుడూ అంతే. అన్నట్లు మీ కాలు వాపుకు ఇన్జక్షన్ ఇచ్చాడా నాన్నా!

నాగ : లేదురా....అయినా అదేపోతుంది.

ముర : మందులేకుండా ఎట్లా నాన్నా?

నాగ : నారుకు పనికిరాని నీళ్ళు, నా కెందుకయ్యా ఈ మందులు? శా గుపడి బాముకునేది ఏముంది. అవన్నీ నీకు పనిచేస్తే చాలు కాని... కాని ...

ముర : నాన్నా!

నాగ : నాన్న వేదన నీకు వినిపిస్తుంది కాని కనిపించదయ్యా!

రాధ : మామయ్యా!

నాగ : అమ్మాయ్ .... కాంతిపుంజాలలో కళకళలాడిన మీకు ఈ చీకటి తడుములాటల్లో బాధపడటం

చూడలేక ఆరాటపడుతున్నాను. చిలకా గోరింకల్లా తిరిగి మిమ్మల్ని చూసి ఉల్లాసపడే నా జీవనాకాశంలో ఎందుకో ఈ ఉల్కాపాతం ... క్షణికంలో తీవ్ర సంచలనానికి లోనయ్యాను అంతే.

ముర : మనమంచికే నాన్నా. ఆనాడు నేనీ అపదను ఎదుర్కొనకపోతే ఈనాడు ఆ చిన్నారి పాప తల్లిదండ్రుల శాపం మనకి మరోవిధంగా తగిలేదేమో?

నాగ : ఇది శాపం కాక వరమా?

ముర : నాన్నా! నన్నేం చెయ్యమంటావ్ చెప్పు? కాలు దగ్గరికి వెళ్ళేదాకా ఆ పాపను చూడలేదు. ఎదురుగా ప్రాణాలు తీసేందుకు వచ్చే కారును చిరునవ్వుతో నిర్గుణంగా ఆహ్వానిస్తున్నాదా పాప. నాకు తెలుసు మరో మార్గం లేదని. క్షణికంలో తీవ్రసంచలనానికి లోనయ్యాను. అంతే....రమేష్‌కు అడ్డుపడి స్టీరింగు ప్రక్కకి తిప్పాను. అది మా ప్రాణానికి అపాయం అని తెలుసు. ఆ క్షణంలో నా మెదడులో విపరీతమయిన క్షోభకల్గి నేనేం చేస్తున్నానో తెలియకుండానే అలా చేశాను. లాంప్‌పోస్టుకు కొట్టుకున్న కారు తలక్రిందులయ్యింది. వెయ్యి సమ్మెటపోటులు తల మీద పడ్డాయి. కళ్ళు గట్టిగా బాధతో మూశాను. ఏమిటో చిత్రం అప్పట్నుంచి ఎన్నిసార్లు కనురెప్పలు ఆడినా సన్నటి వెలుగే కనపడదు నాన్నా!

నాగ : కనపడదు - కనపడదు.

[రమేష్ వస్తాడు]

రమే : నమస్కారమండీ!

నాగ : రా బాబూ!

రమే : ఎన్నిసార్లు చెప్పినా మానలేదన్నమాట?

నాగ : మన్నించు బాబూ!

రమే : మురళీ! తలపోటు ఎల్లా ఉంది?

ముర : తగ్గింది.

రమే : Bandage తీసేస్తాను. మిక్చరు త్రాగుతున్నావుగా అప్పుడే మానకు.

రాధ : త్రాగడంలేదు రమేష్.

రమే : ఏరా?

ముర : ఆ మిక్చర్ నాకెందుకురా?

రమే : తలపోటుకి. పూర్తి అనుమానం పోయేవరకూ త్రాగవలసిందే. రాధా, తోటలో కొంతసేపు త్రిప్ప మన్నాను.

రాధ : లేదు రమేష్. ఒంటిగా వెళ్ళలేరు. ఎవర్నీ బాధ పెట్టరట.

ముర : రాధా !

రమే : బాగానేఉంది వరస. అన్నట్లు బెనర్జీ రిప్లై వ్రాశాడు. (అందరూ ఆతృతగా వింటారు) టెక్నికల్‌గా....

ముర : ఊఁ... టెక్నికల్‌గా....

రమే : కష్టమంటాడు. సైకలాజికల్‌గా ఫాలో కావాలిట.

ముర : అదేమిట్రా? ఇది ఏమన్నా మెంటల్ కేసా?

రమే : అందుకే మళ్ళీ వివరంగా వ్రాయమని వ్రాశాను.

రాధ : పోనీ ఆయనన్నే ఒకసారి రమ్మంటే...

రమే : బాగానేవుంటుంది కాని....

నాగ : ఖర్చుకి వెనకాడొద్దు బాబూ!

రమే : ఇదివరకే రమ్మని వ్రాశాను. కాని వచ్చి ప్రయోజనం ఉండదని...

ముర : ఉంటే ఆశ లేదనేగా?

రమే : (నసుగుతూ) Exact గా అల్లాగని కాదు.

రాధ : (నోట్లో చెంగు కుక్కుకుని లోపలకి పరిగెడుతుంది)

నాగ : అబ్బా! (అని సోఫాలో కూలబడతాడు)

రమే : ఏమిటండీ?

ముర : నాన్నా!

నాగ : (తేరుకొని) ఏంలేదు బాబూ!

వెంక : కంగారుగా (వస్తూ) బాబూ! అమ్మాయిగోరు....

(నాగభూషణం, రమేష్ తొందరగా లోపలికి పరిగెడతారు. వెంకన్న వెళ్ళబోతుండగా)

ముర : వెంకన్నా!

వెంక : బాబూ !

ముర : మళ్ళీ పడిపోయిందా!

వెంక : అవునయ్యా! ఇదెక్కడి గ్రహచారమో బంగారు తల్లికి....

ముర : వెంకన్నా.... నేనింకా...

వెంక : బాబూ... బాబూ! మీ కాళ్ళుపట్టుకుంటాను. మాట్లాడకండి అట్లాంటి మాటలు.

రమే : (తిరిగివస్తూ) మురళీ! ఎప్పట్నించిలా?

ముర : నా కళ్ళు మూతపడ్డప్పట్నుంచి (వెంకన్న లోపలికి వెడతాడు)

రమే : మరి నాతో ఎందుకు చెప్పలేదు ఇంతకాలం. అది సరే, ఇటువంటి సమయంలో అలా ఊరికే కూర్చుంటే ఎల్లారా! వాళ్ళ సంగతి కనిపెట్టక్కర్లే.

ముర : ఏం చెయ్యగలను నేను ఆమె మానసికాందోళనే ఆమెకీ గతి పట్టించింది రమేష్! చూడలేను కాబట్టి అడుగుతున్నా. రాధ రూపం ఎంతమారిందో చెప్పు ఒక్కసారి.

రమే : ఏం చెప్పమంటావ్! ఏదో వ్యధతో నిద్రాహారాలు సరిగ్గాలేక అల్లా సిరసించిందనుకున్నాను. కాని ఇంత తీవ్రంగా అయిపోతుందనుకోలేదు. ఈ ఫిట్సు రాకుండా ఆపకపోతే ఆఖరికి....

ముర : తెలుసు రమేష్, దీనికి ఏం చెయ్యాలి?

రమే : ఈ బాధను మరిపించాలి.

ముర : ఎలా?

రమే : మనస్సు మరోవైపుకి త్రిప్పి.

ముర : అంటే

రమే : ఆమె రోజులో కొద్దిగంటలయినా నీస్థితి మర్చిపోవాలి. వేరే విషయాలు....

ముర : ఆమె సంగతి నీకు తెలియదా?

రమే : తెలుసు అటువంటప్పుడు శాసించు ఆమె మంచి

కోసం;

మురః ఏమని? ఏలా?

రమేః ఆలోచించు. నేను ఇప్పుడే వస్తాను;

మురః (ఆలోచిస్తో అటూ ఇటూ తిరుగుతూ ఉంటాడు.)

రమేః (వస్తో)ఫర్వాలేదు బాగానే తేరుకుంది.

మురః సరే నన్ను లోపల రాధదగ్గరవదలి నాన్నకి ఇంజెక్షన్ ఇస్తూండు. నేను రాధతో మాట్లాడాలి.

రమేః ఏమని?

మురః ఆమెను ఎక్కడకయినా వాతావరణం మార్పు కోసం పంపుతాను.

రమేః భలే పిచ్చివాడివిరా! ఒంటరిగానా?

మురః కాదు. రవితోడుగా!

రమేః ఇద్దరిమధ్య అసలే పచ్చగడ్డి భగ్గుమంటుంది.

మురః అవును. అదీ నిజమే. పోనీ వెంకన్నయితే.

రమేః ఒరేయ్! ఎందుకు వృధాప్రయాస నిన్ను ఇక్కడ వదలి వెళ్లమంటే అర్థం ఉందా? అంతకంటె పగలు పదిగంటలనుంచి, హాయిగా మన హాస్పటల్ లో నాకు సాయంగా ఉండమను.

మురః రమేష్! నిజంగా నానాటికీ నీ రుణం మాకు ఎక్కువవుతోందిరా! నువ్వు చెప్పింది ఓ విధంగా మంచిది. నా దగ్గర ఉన్నట్లుంటుంది. మనమనుకున్నదీ అవుతుంది

నాగః (వస్తూ) ఏమిటి నాయనా అది. (వీరిద్దరి సంభాషణ

జరుగుతున్నప్పుడు రమేష్ మందు సిరంజిలోకి ఎక్కిస్తోంటాడు.)

ముర : నాన్నా! నేనొక ఆలోచనకు వచ్చాను. రాధకి ఈ ఫిట్సు రావడం మంచిది కాదు.

నాగ : ఏంచేస్తాం మనం మాత్రం? ఆమె హృదయంలో అగ్నిగుండాలు పెట్టుకుంది.

ముర : అవును నాన్నా! ఆ అగ్ని ఆమెని దహించకుండా చూడడంకోసమే నా యీ ఆలోచన.

నాగ : ఏమిటయ్యా అది?

ముర : అస్తమానూ, నేను కనిపిస్తో అనుక్షణం ఆమెలో బాధను ద్విగుణీకృతం చేయకుండా ఉండడానికి రోజూ రాధని మన హాస్పిటల్ కి పంపితే.

నాగ : (ఆలోచిస్తాడు)

ముర : మాట్లాడవేం నాన్నా! మన మంచికోసం ఆమె చేసిన త్యాగాన్ని ఆమె నిలా బలిచేయడం మంచిదా?

నాగ : కాని రాధ వెడుతుందా? అయినా అల్లా వెళ్ళనియ్యడం మనకి మంచిదా అని

ముర : వెళ్ళినంతలో తప్పేముంది నాన్నా!

నాగ : తప్పనేమాటకి నిర్వచనం లేదు నాయనా. మన క్షేమంలేనిదల్లా తప్పే, పదిమందీ ఏమనుకుంటారు!

ముర : నేను గుడ్డివాడినయ్యి ఆమె జీవితం మంటగలిపానని ఈ పదిమందీ అంటూండగా వినడంలేదా! ఇదీ అంతే.

నాగ : అవును బాబూ! నువ్వే ఏమంటావు రమేష్?

ముర : వాడి సలహాయే నాన్నా ఇది.

నాగ : అయితే నా కభ్యంతరం లేదు.

ముర : నాన్నా! నన్ను లోపలికి తీసుకువెళ్ళు. రాధతో మాట్లాడి వప్పించి వస్తాను. ఈలోగా Injection తీసుకో. (లోపలికి ఇద్దరూ వెడతారు. ఈ లోగా రమేష్ జేబులోని ఉత్తరాన్ని తీసి చూచుకుంటాడు)

నాగ : (వస్తూ) రమేష్ ...మనం చేసిన ఈపని తప్పు కాదు కదూ?

రమే : రాధ మేలుకోరేగదండి. అంతకన్న ఏముంది?

నాగ : కానీ లోకం.

రమే : దానికి జడిసే సమయాలు వేరే వున్నాయి. కూర్చోండి ఇంజెక్షన్ ఇస్తాను.

నాగ : రాధ ఆరోగ్యం బాగుపడడం ముఖ్యం రమేష్. అసలే అమ్మాయి వీడికోసం మతి చెడగొట్టుకుం టోంది.

రమే : అవునండి.

నాగ : ఈ ఫిట్సు తగ్గి తిరిగి మామూలు మనిషి అవుతుందం టావా?

రమే : తగ్గవచ్చండి ప్రయత్నంచేస్తే.

నాగ : ఒక చెంప మురళి అంధకారం. మరొక చెంప రాధ అయోమయస్థితి నన్ను కదల్చివేస్తోంది రమేష్.

రమే : వస్తే కష్టాలు ఒక్కసారే కదండీ. వాటిని ఎదుర్కో నడమే మీలాంటి ధీరుల లక్షణం

నాగ : ఏమో?

రమే : (మురళి ప్రవేశం. రమేష్ మురళిని గుమ్మంలోనే పట్టుకొని) జాగ్రత్తరా! మురళీ పద Bandage తీస్తాను.

ముర : నాన్నా! రాధ ఒప్పుకుంది. రోజూ ఆస్పత్రికి వెడతానంది.

నాగ : మంచిది బాబూ! మీ ఇష్టం. అబ్బ ఈ ఇంజెక్షన్ వేడికి వళ్ళంతా ఉబ్బరిస్తోంది. అల్లా తోటలోకి వెడతాను. వెళ్ళేటప్పుడు కనిపించు రమేష్. వెడతాడు)

ముర : రమేష్. మేడమీదకి పద, మా అమ్మదగ్గరికి.

రమే : ఎందుకూ?

ముర : నా Bandageఅక్కడే తీద్దువుగాని.
(ఇద్దరూ మేడమీదకి వెడతారు. రాధ మొహం తుడుచుకుంటూ వచ్చి సోఫాలో కూలపడుతుంది. రమేష్ మెట్లుదిగి వస్తోండగా రాధ చూసి మొహం చిట్లించుకుంటుంది.)

రమే : రాధా!

రాధ : ఏం?

రమే : ఒక ముఖ్య విషయం మాట్లాడాలి నీతో.

రాధ : నాకు తెలుసు అయినా ఎందు కలాంటి సలహా ఇచ్చావ్ వారికి?

రమే : ఏ డాక్టరయినా అటువంటి సలహా ఇస్తాడు నీలాంటి పేషెంటుకు.

రాధ : కాని నువ్వీ సలహా ఇవ్వడం...

రమే : నీ సుఖంకోరే.

రాధ : వారి సుఖం పాడవటంతే.

రమే : ......... ....

రాధ : మాట్లాడవేం?

రమే : అది వాడాలోచించుకునే....

రాధ : ఏమిటి మర్మగర్భంగా మాట్లాడతావ్ సూటిగా చెప్పరాదా!

రమే : (నవ్వుతాడు)

రాధ : రమేష్!

రమే : క్షమించు రాధా! నేను ఆలోచించేది నీ భవిష్యత్తు గురించే అది సౌఖ్యప్రదంగా ఉండాలనే నా తాపత్రయం.

రాధ : రమేష్.... (ఉద్రేకాన్ని అణుచుకుంటూ) నీలో ఇన్నాళ్ళు అణిచి ఉంచుకున్న దౌర్బల్యాన్ని ప్రదర్శించేకన్నా, అమాయకులను పాడుచేసి, అయాచిత సలహాలిచ్చేకన్నా....ఇంకా మంచిపనులు చాలా ఉన్నాయి మానవుడు చేయడానికి.

రమే : పొరపాటు...గతంగురించిన ఆలోచనలు వెనక్కినెట్టి భవిష్యత్తుకు బాట వేసుకో....కొద్దిరోజుల వ్యవధిలో నీవు పొందబోయే సౌఖ్యం ఆనందాలకోసం ప్రస్తుతం కొంతకాలం మొండిగా అవాంతరాలు ఎదుర్కొని జరిగిన పొరపాటు తరలించుకోమంటున్నాను.

రాధ : (విసుగ్గా) రమేష్.... నన్నింక చిత్రవధ చేయకు. నాలో ఇంకా మిగిలిన ఓర్పు కాస్తా ఇప్పుడే హరిం చేయకు.

రమే : కాదు రాధా!... కొంచెం నిదానంగా ఆలోచించు. నా ఉద్దేశ్యం పూర్తిగా విని అచరణలో పెట్టు.

రాధ : ఈ మహాబోధనకేనా వారిని వదిలి వచ్చావ్!

రమే : కాదు... అనుకోకుండావచ్చిన అవకాశాన్ని సద్విని యోగం చేస్తున్నాను.

రాధ : రమేష్... ....

రమే : వాడు వాళ్ళ అమ్మ Photoతో చెప్పుకునేవరకు నన్ను క్రిందికి వెళ్ళమంటే వచ్చాను.

రాధ : దయచేసి నీ వాక్చాతుర్యంతో నన్ను కలవర పెట్టకు ... నే నీ మాటలు అర్థంచేసుకునే పరిస్థితిలో లేను.

రమే : పోనీ చదువుకున్నావు.... చదివైనా తెలుసుకో. ఇదిగో ఈ రెండు ఉత్తరాలు చదివి బాగా ఆలో చించుకో.... వీటిల్లో విషయాలమీదే నీ భావి జీవన మార్గాలు నిర్ణయమయ్యాయి.

రాధ : రమేష్ నీకు దణ్ణంపెట్టాను.... నేనిప్పుడే ఉత్తరాలూ చదవను.... వెళ్ళిపో.

రమే : వెళుతున్నా! ... కాని ఈ ఒక్క-కోరిక మన పాత స్నేహాలమీద కాదనకు .... (టేబుల్ మీద పెట్టి వెడతాడు)

[రాధ ఉత్తరాలకేసి రోషంగా చూసి. ఆ ఉత్తరాలు నలిపి పడేసి వెళ్ళబోయి మళ్ళీ కూర్చుంటుంది. చివరికి మనస్సు నిబ్బరంగా ప్రతీకార దృక్పథంతో ఒణుకుతున్న చేతులతో ఉత్తరాలు సరిచేసి చదువుతుంది .... రోషం ఆశ్చర్యం .... అనుమానం .... అర్థంగానితనంతో ఆలోచనలలో పడ్తుంది. లేచి అటు, ఇటు తిరుగుతోండగా ఆగి మెట్లమీద రమేష్‌ను నిశ్చలంగా చూస్తుంది.. అతను అట్లాగే చూస్తాడు.]

రమే : (మెట్లు దిగుతూ) *F*racture Set అయ్యిందిరాధా!

రాధ : (అయోమయంగానే Thanks రమేష్!

రమే : (*B*ag సర్దుకుంటూ, ఆమె చేతిలోని ఉత్తరాలను చూపిస్తూ) ఆ ఉత్తరాలు ఇస్తావా?

రాధ : వీటి అర్థం ఏమిటి?

రమే : చదివావుగా?

రాధ : ఆలోచించుకునే శక్తి నశించిన ఈ స్థితిలో ఏంచెప్పమంటావ్?

రమే : అవకాశం కావాలా?

రాధ: రమేష్ నిన్ను పూర్తిగా నమ్ముతున్నాను.

రమే: Thanks.

రాధ: నడిసముద్రంలో ముంచవని....

రమే: ఆశలు అడియాసలు కాకుండా ఉండడానికే యీ ప్రయత్నం.

రాధ : అంతేనా?

రమే : నమ్మకం ఉన్నప్పుడు వాగ్దానాలతో పనేముంది. అన్నీ నేను చూసుకుంటాను. నువ్వు కేవలం నేను చెప్పినట్లు ఆచరించడమే.

రాధ : మరి మామగారు ...

రమే : ఈ విషయంలో నీ సౌఖ్యంకోసం.... అంతే ఈ వేళ నుంచే ఆస్పత్రికి రా. వస్తాను ఉత్తరాలు తీసుకుని వెడతాడు

రాధ : (కొంచెం సేపు రమేష్ వెళ్ళిన దిక్కు చూసి మెల్లె కొట్టూండగా రవి వస్తాడు . రాధను చూసి.)

రవి : అన్నయ్య మేడమీద ఉన్నాడా ?

రాధ : ఉన్నారు. రమేష్ యిప్పుడే వచ్చి వెళ్లాడు.

రవి : ఏమన్నాడు ?

రాధ : Fracture Set అయిందన్నాడు.

రవి : నాతోనూ చెప్పాడు ఆవిషయం.

రాధ : మరి.

రవి : ఇంకేమయినా చెప్పాడేమోనని.

రాధ : అంటే ?

రవి : ఏంలేదు.

రాధ : అన్నయ్య దగ్గరికి రావా?

రవి : నువ్వు వెళ్ళు.... నేవస్తాలే.

రాధ : మంచిది.

5)

రవి : (ఆమె రెండుమెట్లు ఎక్కగానే, వదినా!

రాధ : ఏం?

రవి : కోపం వచ్చిందా?

రాధ : ఎందుకు?

రవి : తెలియదు. తెలిస్తే బాగుండును. తెలియకుండానే కోపం వస్తుంది ఏమిాఅనుకోకు, వస్తాను (అంటూ లోపల గదిలోకి వెడతాడు. రాధ తెల్లబోయి తేరుకొని మెట్లు ఎక్కుతుండగా.)

— తెర —

# 3 వ రంగం

రంగం మామూలే. (కొన్ని నెలల తర్వాత)

రవి : (చేతిలో మందు సీసాతో లోపలికివస్తూ) వెంకన్నా!...వదిన ఇవ్వాళకూడా వెళ్ళిందా?

వెంక: వెళ్ళారు బాబూ రమేసయ్యతో

రవి : అన్నయ్య ఏం చేస్తున్నాడు?.

వెంక: మేడమీద నిద్దరోతున్నారు.

రవి : అన్నయ్యతో చెప్పి వెళ్ళిందా వదిన?

వెంక: నేసెపుతానంటే లేచాక సెప్పొచ్చులే అన్నారు రమేసయ్య.

రవి : ఉహు........

వెంక: నువ్వెక్కడకి ఎల్లావయ్యా?

రవి : పోరాసి చోటుకేలే! అందుకే తలవాచి ఇంటికి వచ్చాను.

వెంక: అదేటి బాబూ?

రవి : మన హాస్పటల్‌కి వెళ్ళాను అన్నయ్య మందు తెమ్మంటే....ఆ కాంపౌండరు ...రమేష్ పెర్మిషన్ లేందే ఇవ్వనన్నాడు.

వెంక: ఏందీ అన్నాయం?.

రవి : మన బ్రతుకులు వాడికే లోకువయ్యాయి.

వెంక: అదేంమాట సినబాబూ!

రవి : అయినా అన్నయ్య కళ్ళతోపాటు మనకా ఆస్పత్రి మీద అధికారం పోయిందిలే!

వెంక: ఒదినమ్మగోరు సూసకోటం లేదా బాబూ?

రవి : వెంకన్నా వదిన రోజా ఆస్పత్రికి వెళుతోందను కుంటున్నావ్! లేదు

వెంక: ఏందీ! నిజమేనా బాబూ!

రవి : ఆస్పత్రిలో అందరూ అనేమాటే అది ...ఆవిడ అక్కడ మొహం చూపించి మూడువారలయ్యిందిట ....రమేష్‌కూడా....

వెంక: సిన్నయ్యా, మీరనేమాట గుండెల్లో పొడిసేది. నాకేటో అర్దం కావటంలేదు.

నాగ : (వస్తో) గుండెల్లో పొడిచేదేకాదు. కొన్నిజీవితాల్ని నాశనం చేసేది. రవీ! నీ తొందరకీ ఉద్రేకానికీ అంతుండాలిరా ! నువ్వు ఎవరిగురించి మాట్లాడు తున్నావో కాస్త ఆలోచించరా! నీ వదినరా ! మనకోసం తన సర్వస్వాన్ని ధారపోసిన స్త్రీమూర్తి. ఆమెనురా నువ్వు శంకించేది?

రవి : నేను కాదు, లోకం అంతా శంకిస్తోంది. నేను ఉద్రేకపరుణ్ణయితే కావచ్చు. కాని ఈవిషయంలో మాత్రం కాదు.

నాగ: కాస్త ఆలోచించి మాట్లాడరా ?

రవి : ఏమిటి ఆలోచించేది? ఎందుకు ఆలోచించేది? మన బ్రతుకులు బజార్లో పడుతున్నందుకా? మీరంతా దేవతామూర్తి అని నమ్మిన స్త్రీ పతనమవుతున్నందుకా ?

నాగ : నాయనా నెమ్మదిగా మాట్లాడరా! (అని మేడపైకి భయంగా చూస్తాడు)

రవి : నెమ్మదికి ఇందులో దాచాల్సిన రహస్యం లేదుగా.. ఈ వేళ తెలిసేది రేపయినా తెలవకపోదుగా?

నాగ : రవీ ?

రవి : వదినకు ఈరకం స్వేచ్ఛద్వారా మన బ్రతుకు....

నాగ : ఏమయ్యిందేమిటీ ?

రవి : నడివీధి పాలు కాకూడదు. అన్నయ్య హృదయం ఏమిటో నీకు బాగా తెలుసు. అన్నయ్య మౌనానికి కారణం ఏమిటో! నా మాట విని కాస్త ఆలోచించండి.

నాగ : అక్కర్లేదు. అవసరం కూడా లేదు.

(మురళి మేడమీద కిటికీవద్ద నిలబడి ఉంటాడు)

రవి : అంత తేలిక కాదు. ఆవిడంటే ఎందుకంత మమకారం ?

నాగ : తెలీదా! మన గౌరవం చూసి మనకున్న ఆస్థిచూసి కాదు. మనఇంటి కోడలయ్యింది.

రవి : అంటే మీరనేది ?

నాగ : ఉన్నతమయిన ఆదర్శాలతో మన ఇంటి కోడలు గావచ్చింది అటువంటి రాధని ఈ రోజున....

రవి : అవును నాకు తెలుసు. ఆమె ఆదర్శాలవైపు మ్రుగ్గిన మీామనస్సులను ఇటువంటి సంఘటనలు చలింప చేయలేవని. నాన్నా! ఈనిప్పు రగిలి మంటలు లేవక ముందే మేల్కొనాలి.

నాగ : ఆపరా! (విసుగ్గా) అదేమాట నిన్నుంచుకనకూడదు. నీకు అసలు వదినంటే కిట్టక ఇదంతా చిలువలు పలువలు అల్లుతున్నావేమో?

రవి : నాన్నా.... ఏమిటి.... నాన్నా... అర్థంఅయ్యింది. అవును. అలా అనేనన్ను ఇన్నాళ్ళు కష్టపెడ్తున్నారు. ఒదిన రావాలని ఊహ తెలిసినప్పట్నించి ఉవ్విళ్లూరుతూనేఉన్నాను. ఒదిన వచ్చిన తర్వాత అన్నయ్య నా నుంచి దూరమవుతూ వచ్చాడు. అనుకోని ఈ విఘాతాన్నుండి తెప్పరిల్లేసరికి ఈ విషమ సంఘటన మళ్లా మనస్సును కలవర పరుస్తోంది.

నాగ : ఇటువంటి వాటిల్లో తల దూర్చకుండా నీగొడవేదో నువ్వు చూసుకుంటే బాగుంటుంది.

రవి : అంతేనా !

నాగ : తప్పకుండా !

రవి : ముందే జాగ్రత్త పడమంటున్నాను.

నాగ : నోరు ముయ్యమంటున్నాను.

రవి : మూస్తాను. నానోరు మూాయించే శక్తి మీాకుంది. కాని లోకం ..వాళ్ల నోళ్లు మూాయించలేరు, "పెళ్లి

కాని పరాయి పురుషుడితో మీావదిన పికార్లేమి టోయ్" అని ఆ రాస్కేల్ రమణరావు కూడా అనేవాడే... ఇవన్నీ మీాదాకా వస్తే కాని తెలియవు.

వెంక : రవయ్యా! ఆడిని నాకు సూపించయ్యా! ఆడి నాలుక పిండేస్తాను.

రవి : ఎంతమంది నాలుకలు పిండుతావ్! ఎందరిగొంతులు నొక్కుతావ్! వెంకన్నా. మన బంగారాన్ని మనం జాగ్రత్త చేసుకోవాలి... అంతే.

నాగ : రవీ ! బాగావిను. నేను చెప్పేది బాగావినరా! 'ఈ సంఘటనలు నీ లేత మనస్సును బాగా గాయపర్చి ఉండవచ్చును. అసలే నీకు తొందర ఎక్కువ. ఈ విషయాన్ని పూర్తిగా నామీాద వదలెయ్యి.' అని నేను తండ్రిగానే కాక, బాధ్యతలు గల కుటుంబాధి నేతగా చెప్తున్నాను. కాదన్నావా... పరిస్థితులు...

రవి : అంతేకాని. ఆవిడ్ని మంచి మార్గాన్న పెట్టరన్న మాట.

నాగ : మాట, మాటకి ఆ అమ్మాయి పేరెత్తకు. కలకల లాడుతూ సాగే వాళ్ల దాంపత్యంలో చీకట్లు దాపు రించే సరికి ఒక్కసారి పిచ్చిపిల్ల ఎంత కృంగి పోయిందో తెలుసా! ఆ త్యాగమూర్తిని తొందర పడి నిందిస్తావా? నాకు ఇల్లాంటి కొడుకుగా జన్మించి నా కడుపులో చిచ్చు పెట్టకురా! రవీ...నాయనా నన్ను ఆలోచించుకోనీయరా! కాస్త తొందర పడకురా.

రవి : మీ ఇష్టంవచ్చినట్లు చేసుకోండి. నేనువెడుతున్నా. (అంటూ లోపలికివెళ్లి felt cap తీసుకొని)అయినా నేనే తొందరపడి ఉంటాను. మీరూఆలోచించండి. (అని బయటికి వెడతాడు)

వెంక : రవి బాబుగోరు ఏదో బాధపడతారు. ఏటో అంటారు. మళ్లీ కాదంటారు.

నాగ : వాడెప్పుడూ అంతేకాదురా! గాలివానలావస్తాడు. వెడతాడు. వాడిమాటలు...ఆ... వెంకన్నా! మురళి నిద్దర పోక పోతే ఒక్కసారి పిల్చుకురా!

వెంక : బాబుగోరూ!

నాగ : ఫర్వాలేదు. వెళ్ళితీసుకురా! (వెంకన్న ఇష్టం లేనట్లుగానే కనపడతాడు. నాగ భూషణం పచార్లు చేస్తోంటాడు. మురళిని వెంకన్న మెల్లగా తీస్కు వస్తోంటాడు)

ముర : పిల్చావా! నాన్నా!

నాగ : ఆ పిల్చారా. .ఇంకా నిద్రపోలేదూ.

ముర : లేదు.

నాగ : ఏంలేదు..ఊరికేనే...పిల్చాను. చూడు! అమ్మాయి రాధ ఆరోగ్యం కొద్దిగా కుదుటపడిందనుకుంటాను.

ముర : ఆ బాటానేఉందిట. ఫిట్సుకూడా రావడంలేదు.

నాగ : అలాఅయితే ఇంకరాధ ఆస్పత్రికి వెళ్లడం అవసరం ఉండదుగా...

ముర : అవసరం ఉండదని కాదు వెళ్లకపోతే ప్రమాదం మాత్రం లేదు.

నాగ : అదికాదురా! నువ్వు ఒక్కడివీ ఏమీ తోచక ఇంట్లో కూర్చోడం. అదీకాక అప్పుడేదో అమ్మాయి ఆరోగ్యం బొత్తిగా పాడుచేసుకుంటోందని పంపాం! నీకు తోడుగా రాధ ఇంట్లో ఉంటే...

ముర : నాకుతోడు ఏమిటినాన్నా! రాధఆరోగ్యంపూర్తిగా కోలుకుంటే అదేచాలు.

నాగ: అందుకు నేను కాదనను. కాని మురళీ! ఒక్క విషయం ఆలోచించు. రాధ రాత్రనక, పగలనక రమేష్‌తో కలిసి రోగులకు సేవచేస్తోంది. దీనివల్ల ఆ మెకు మనశ్శాంతి లభించి ఉండవచ్చు ఆమె ఆరోగ్యం బాగుపడనూవచ్చు. మనం అదే ఉద్దేశ్యంతో పంపాము. కాని ఈ ఉద్దేశాలను, ఆదర్శాలను, తెలుసుకోలేని కొందరు,కొందరేమిటి ఈ లోకంలో వాళ్లే ఎక్కువ సంఖ్యలో ఉన్నారేమో! ఏదో అంటారు. పెద్దవాణ్ణి ఒక్కమాట చెప్తావిను, అప్పుడు నిన్ను తృప్తిపరచడానికి అమ్మాయిని పంపడానికి సరే అన్నాను. కాని లోకం.... లోకం....

ముర: అర్థమయ్యింది.

నాగ: అమ్మాయిని శంకించి చెప్పడం లేదు. ప్రపంచాన్ని చూసి, సంఘంలోని వ్యక్తుల్ని చూసి భయంతో అంటున్నాను. ఏ చిన్న అవకాశం ఉన్నా, వంకలు పెట్టి విరగబడినవ్వడంకోసం.... వ్యక్తులు చూస్తారు. తోటి మానవుణ్ణి అర్థం చేసుకోక నిట్టని వాళ్ళు వట్టి

6)

పుకార్లు లేవదీస్తారు. జనం నమ్ముతారు. లోకం అంతా అదే నిజం అంటారు. చివరికి ఆ మోసానికిని తలవగ్గవల్సింది మనం. సంఘ వ్యవస్థలో అందరి కీన్యాయం ఆలోచించే ఓర్పులేక, ప్రక్కవాడి బాధ, తనకి ఆనందం ఇస్తే అదేచాలు. ఈ పాడు గొడవలు తప్పించుకుందుకు మన మంచి కోసం అమ్మాయితో చెప్పిచూడు. రాధ అర్థం చేసుకోగల వ్యక్తి.

ముర: అర్థమయింది నాన్నా! అందర్నీ అర్థంచేసుకుంటు న్నాను.

నాగ: అంతే నాయనా! నీ ఉద్దేశ్యం నాకు తెలుసు. కాని తప్పను. నాకోరిక కాదనకు. నీ కష్టసుఖాలు ఆలోచించే చెప్పాను. ఇంతకంటే నేను చెప్పేది లేదు. బాగా ఆలోచించు. వస్తా. రారా వెంకన్నా!....
(అని నాగభూషణం, వెంకన్నా వెడతారు. మురళి సిగరెట్టు ముట్టించి కాల్చుకుంటూండగా క్రమంగా చీకట్లు ఆవరిస్తాయి బయట "వస్తా రమేష్" అనే మాటతో రాధ లోపలికి వచ్చి, చీకట్లో)

రాధ: అబ్బా ఇంత చీకటిగాఉంది. లైట్లు వెయ్యలేదే (అంటూ స్విచ్ వేస్తుంది. మురళిని చూసి కంగారుగా) ఇదేమిటి చీకట్లో కూర్చున్నారు?

ముర: చీకటి పడిందా? అవును.... నేను తెలుసుకోలేను గదా.

రాధ: (Shock తిని) ఇంట్లో ఎవ్వరూ లేరా!

ముర: ఉహూ!

రాధ: మిమ్మల్ని ఒక్కర్ని వదిలి వెళ్ళారా!

ముర: వాళ్ళ తప్పేముందిలే? ఎంతకాలమని వాళ్ళు మాత్రం నాతో ఈ బంధిఖానాలో ఉండగలరు.

రాధ: ఏమిటా మాటలు?

ముర: అబ్బే? ఏం లేదు. ఇలా నెలరోజులనుంచి ఒకనాటి కొకనాడు ఒంటరి తనం ఎక్కువవుతోంది ... మతి స్థిమితం తగ్గుతోంది!

రాధ: తోటలో కాస్సేపు కూర్చోకూడదా?

ముర: కాళ్ళకి రాళ్ళు తగులుతాయని భయం రాధా! సరే ఇప్పుడు నీ వంట్లో బాగాకులాసాగా ఉంది కదూ?

రాధ: బాగానే ఉంది

ముర: రాధా! ఒకటి అడగాలని ఉంది. బాధపడవుగా!

రాధ: ఏమిటండీ ?

ముర: ఇష్టం లేకుంటే లేదని చెప్పెయ్యాలి.

రాధ: అసలు ఏమిటండీ ?

ముర: ఏమీ లేదు! రేపట్నుంచి ఈ గుడ్డివాడికి తోడుగా!

రాధ: మీ చేత అడిగించుకునేవరకూ.... నేను...

ముర: అదిగో....అదే వద్దన్నాను. నేనేగా నిన్న బలవంతంగా పంపిది.

రాధ: అవునండి. మంచి అనుకునే నన్ను ప్రోత్సాహించారు.

ముర: రాధా! రేపట్నుంచి కొన్నాళ్ళపాటైనా ఎక్కడికీ వెళ్ళవు కదూ....

రాధ రేపట్నుంచా ?

ముర: ఏం ?

రాధ: ఏంలేదు. నామీద ధైర్యంకొద్దీ రమేష్ ఉన్న వరస్నకి సెలవు ఇచ్చేశాడే ...

ముర: అయితే.

రాధ: మరో నెల్లాళ్ళు.

ముర: కాదు రాధా! నా పరిస్థితి నీకు అర్థంకాదు. ఒకటి ఆలోచిస్తే మరొకటి అవుతోంది.

రాధ: అంతా భ్రమ! మీరారు మంచే చేశారు ఇంతవరకు.

ముర: అంతేనంటావా ?

రాధ: కాక మరేమిటి ?

ముర: నాకా ధైర్యం ఇచ్చావు రాధా! చాల కృతజ్ఞుడిని.

రాధ: ఎందుకండీ అంతమాటలు:

ముర: ఇప్పు డేమన్నాను.

రాధ: లేకపోతే మీరు నాకు కృతజ్ఞత తెల్పడం ఏమిటి చెప్పండి ?

ముర: భార్యగా నీమీద నాకు స్వాతంత్ర్యం ఉన్నా, అవి టిగా ఆధారపడ్డప్పుడు నువ్వుచూపే ఈ అసాధారణ ఆదరణకు...

రాధ: (నోటికి చెయ్యి అడ్డంపెట్టుకొని ఏడుస్తుంది)

ముర: సరే రాధా! ఇంకేమీ అనను. అయితే రేపట్నుంచి నువ్వు నా దగ్గరే ఉండు. మళ్ళా కుదుటపడతాను.

రాధ: అల్లాగేనండి కాని... కాని...

ముర: ఏం ఫర్వాలేదు. రమేష్‌తో నేను చెబుతాను.

రాధ: సరే.

ముర: రాధా! నాకు రాత్రీ, పగలూ ఒక్కలాగే ఉంటున్నాయి. ఏకాంతంలో, కారు చీకటిలో గడచిన రోజులు ...సంఘటనలు .. జ్ఞాపకాలు నన్ను పదే, పదే వెక్కిరించి హేళన చేస్తున్నాయి. కళ్ళు లేక పోయినా ...చుట్టూ జరిగేవి...చూసినవి ... ఉన్నదున్నట్లు చెప్పేవాళ్ళు లేక బాధగా ఉంది.

రాధ: బాధ పడకండి నే నున్నానుగా.

ముర: అవును. కొన్నాళ్ళు నన్ను విడిచి వెళ్ళకు రాధా! నాకోసం నీ ఆనందాన్ని...

రాధ : అదిగో మళ్ళీ ....

ముర : నిజంగా వెళ్ళవు కదూ....

రాధ : ఎలా వెళ్ళగలను. రండి మేడమీదకు వెడదాం, (అంటూ అతణ్ణి మేడమీదకి తీసుకువెడుతుంది. రమేష్ వస్తాడు. వాళ్ళు వెళ్ళేవైపే చూచి తీవ్రంగా ఆలోచిస్తాడు. సోఫాలో కూర్చుని ఉంటాడు. రాధ మేడ దిగి వెళ్ళబోయి రమేష్‌ని చూస్తుంది.)

రాధ : రమేష్ నువ్వా?

రమే : అవును నేనే....

రాధ : వెళ్ళలేదా ?

రమే : లేదు.... సరే మురళి ఏమంటున్నాడు.

రాధ : ఆయన బాధ నేడు చూడలేను రమే .

రమే : అలా అనుకునే జీవితాంతం నువ్వు బాధ పడవల్సి వస్తుంది.

రాధ : అదే మంచిదేమో అనిపిస్తోంది.

రమే : తాత్కాలికావేశాలకు లొంగి జీవితాన్ని నాశనం చేసుకుంటావా ?

రాధ : రమేష్. ఎందుకు మీ ఇద్దరూ కలసి నన్ను ఇరుకున పెడుతున్నారు.

రమే : నీకు యోచనాశక్తి ఉంది.

రాధ : లేదు రమేష్. పరిస్థితులు ఆశక్తిని పీల్చి పిప్పి చేశాయి.

(రవి వచ్చి గుమ్మంలో ఆగి వింటాడు )

రమే : పోనీ నామీద నమ్మకమైనా ఉందిగా రాధా. కావలసిన సమయం చేరువలోకి వస్తోంది. ఈ సమయంలో బలహీనతకు చోటుఇవ్వకు. ముందున్న సిద్ధాన్తాన్ని చేజేతులా పాడుచేసుకోకు. నామీద నమ్మకం ఎప్పటిలాగే ఉండనియ్యి. సమయం రాగానే అన్నీ సర్దుకుంటాయి.

(రవి ఏదో మాటాడాలని ఒక్కసారి ముందుకువచ్చి నిలబడతాడు. కాని మాట్లాడడు, లోపలికి వెళ్తాడు.

రమే : (రవి వెళ్ళిన వైపే చూసి) చూశావా రాధా! ఏమిటో ఇదంతా. ఇప్పుడు రవి ఏం చేస్తాడంటావ్?

రాధ : రవి బాగా మారిపోయాడు. మాటా పలుకు లేకుండా లోపలికి వెళ్ళాడు. ఏం చేస్తున్నాడో?

రమే : (గుమ్మం దాకా వెళ్ళి) లోపలకూడా నిశ్శబ్దంగా ఉందే.

రాధ : మొట్టమొదటి సారిగా అతన్నీ స్థితిలో చూస్తున్నాను. పసిహృదయం బాగా గాయపడి ఉంటుంది.

రమే : గాయపడాల్సిందే!

రాధ : (ఉలిక్కిపడి) ఆ! ఏమన్నావ్?

రమే : అంటే మన మంచి కోసం.

రాధ : ఏం మంచో రమేష్! ఏది మంచో, ఏది చెడో ఆలోచించే శక్తి కూడా నశించింది. రవి ఏం చేస్తున్నాడో చూసి వస్తాను. (అని లోపలికి వెళుతుంది రమేష్ వద్దన్నా.)

(రమేష్ లోపల ఏమి జరుగుతుందో అని చూస్తుంటాడు. లోపలి నుండి మాటలు వినబడ్తాయి.)

రాధ : ఏమిటిదంతా రవీ?

రవి : కనబడ్డంలే?

రాధ : నీ బట్టలన్నీ సూట్‌కేస్‌లో పెడ్తున్నావ్! ఎక్కడికేమిటి ప్రయాణం?

రవి : ఈ నరకకూపంలోంచి బయట పడ్తే అదే చాలు.

రాధ : ఏమిటా మాటలు ఇది నరక కూపమా! నీకు కష్టం కల్గించిన విషయం ఏమిటి రవీ !

రవి : అనవసరంగా నన్ను వాగించకు. నాదారిని నన్ను పోనియ్యి. (అంటూ బయటికి వస్తాడు. రమేష్‌ని చూసి ఆగుతాడు. తన వెనకనే వస్తున్న రాధని చూస్తాడు. మళ్ళీ ఒకసారి రమేష్‌ని చూసి రాధతో)

రవి : నాకుకష్టంకల్గించినవిషయమేమిటో చెప్పమంటావా?

రాధ : ఆ.... చెప్పు!

రవి : అవి మీ ఇద్దరికి కూడా కష్టం కల్గించవచ్చు.

రమే : ఫరవాలేదు.

రవి : అయితే వినండి. మీ ఇద్దరి ప్రవర్తన మావంశానికి తీరని మచ్చ తెచ్చింది. నిర్మలమైన మా అన్నకా మీరుద్రోహంతలపెట్టింది. మీరూ మనుష్యులేనా? మీకూ హృదయాలున్నాయా? నిజంగా మిమ్మల్ని ఏమైనా చెయ్యాలనిఉంది. కాని ఆహక్కు నాకులేదు. (రాధ అర్థంకాని ఆవేదనతో ప్రక్కకు తిరిగి ముఖాన్ని చేతులతో దాచుకుంటుంది.)

రమే : బాగా చెప్పావు రవీ! మేము చేస్తున్న పనులు మీ వంశానికి మచ్చే తెస్తాయో, మంచే తెస్తాయో ఇప్పుడు నీకు తెలియదు. ఇటువంటి పరిస్థితులలో ఒక పని చేయరాదు.

రవి : Thanks నీ సలహా చాలు. నేను వస్తా. (అంటూ పెట్టె తీసుకొని బయటికి వెడతాడు.)

రమే : రవీ....ఆగు ...నీకో విషయం చెప్పాలి (అంటూ వెడతాడు.)

రాధ : రమేష్! ఏమిటిదంతా ? (అంటూ ముందుకు నడుస్తుంది. కాని రమేష్ వెళ్ళిపోతాడు. ఏమీ తెలియని అయోమయ స్థితిలో నిలబడిపోతుంది. మురళి దగ్గరకు వెళ్ళాలని నిశ్చయించుకున్నట్లుగా రెండు మెట్లెక్కుతుంది. కాని దిగిపోయి సోఫాలో కూర్చుండగా మనస్సులో వికావికలంగా చేసే భీకర ఘోషతో గాలి, వాన, కిటికీలోంచి వస్తూండగా బిత్తరపోయి చూస్తుంది.)

— తెర —

## 4వ రంగం

### [రంగం మామూలే]

సమయం : ఉదయం 8 గంటలు.

[ నాగభూషణం సోఫాలో విచారంగా కూర్చుని వుంటాడు. రాధ *Tray* తీసుకొని మేడమీదకు వెడుతుంది. వెళ్ళేటప్పుడు మామగారివంక ఒకతడవ చూస్తుంది. కాని యిద్దరూ మాట్లాడుకోరు. ]

వెంక : (వస్తూనే) ఊరంతా గాలించాను బాబూ, రవయ్య జాడ తెలియనేలేదు. ఎక్కడికి పోయిండో, ఏటి సేత్తుండో?

నాగ : వెంకన్నా! ఉత్తరాలన్నీ పోస్టుచేశావా?

వెంక : ఏసేసినా బాబూ.

నాగ : ఆ టెలిగ్రాం?

వెంక : ఇచ్చినా బాబూ. ఈపాటికి చేరే వుండాలి.

నాగ : అదొక్కటేరా ఆఖరి దశ. వాడు దొరికితే అక్కడే దొరకాలి.

వెంక : అవును బాబూ. ఆ అయ్యగారంటే రవయ్యగార్కి ఎంతో సనువు. ఇక్కడుండగా రవయ్య యెప్పుడూ

ఆళ్ళయింటిలోనే వుండేవాడు. ఒక్కొక్కప్పుడు రాత్రిళ్ళుకూడా ఆడే వుండిపొయ్యేవాడు. ఆకరికి బదిలీఅయ్యి యెళ్లేటప్పుడు రవయ్య ...

నాగ : (అదేం వినిపించుకోడు) అదికాదురా! వాడికి ఈ యింటిలో అంత కష్టం ఏం వచ్చిందిరా? నేనింకా బ్రతికే వున్నాను గదరా!

వెంక : బాబుగోరు! అంతమాట అనకండి! (దగ్గరకు వెళ్ళి) మీరు నన్ను సంపినా సర్లే కానీండి, రాదమ్మ మనసు మారిపోనాదండి.

నాగ : (బాధతో కూడిన కోపంతో) వెంకన్నా!

వెంక : లేకపోతే ఏటండీ! ఇంటిల్లో సినబాబు సివికిపోతుంటే ఆ రమేశయ్యతో తిరుగుడు ఏటంట? తెలీక అడుగుతాను. రవయ్య అన్నదాంట్లో తప్పేముంది? అదేం బాగులేదు మానెయ్యమన్నాడు. అంటే మీ రెవరయినా ఇంటేనా? మీరుకూడా కస్సుమసిరి.

నాగ : అవున్రా. మొదట్నించీ వాడిని నేను అర్థం చేసుకో లేక పోయానురా. (కండువాతో కళ్ళు అద్దుకుంటాడు) అర్థంచేసుకున్న వాడిని సమర్థించలేక పోయాను. ఇప్పుడేమనుకుని లాభం?

[ రాధ మేడమీదనుండి వస్తుంది. ]

రాధ : వెంకన్నా! రవి జాడ ఏమైనా తెలిసిందా?

వెంక : ఇంకేడ తెలుస్తుందమ్మా, అంతా కలసి ఆయన్ని ఎల్లగొట్టింతర్వాత.

రాధ : (షాక్ తిని) ఎక్కడికి వెళ్తాడు! అతని ఉద్రేకం మనకు తెలియందికాదు. ఇవ్వాళో రేపో వచ్చెయ్యడూ... అఁ కాఫీ చల్లారిపోతోంది. మామగారికి తీసుకువచ్చి యిచ్చి. (అంటూ డ్రస్సింగ్ రూం లోకి వెడుతుంది)

వెంక : (ఆమె వెళ్ళినవేపే చూస్తో)వస్తాడు. బాబు వస్తాడు.

నాగ : రాధ పూర్తిగా మారిపోయింది వెంకన్నా.

వెంక : అవును బాబూ! ఆ రమేసయ్య ఏదో మాయచేసి అమ్మాయిగోర్ని మార్చేశాడు. అసలు ఇల్లుపట్టి వుండటంలేదు రాదమ్మ... ఇదంతా ఆలోసిత్తే.

నాగ : అవును. ఇదంతా ఆలోచిస్తే ఏదో ఒక విషవలయంగా వుందిరా. రాధ కుదురుగా ఇంటిలో వుండేటట్లు చూడాలి. సరే పోయి కాఫీ పట్రా.

(వెంకన్న వెడుతుండగా రమేష్ ప్రవేశిస్తాడు)

రమే : నమస్కారమండీ!

నాగ : నమస్కారం.

రమే : ఏం! అలా వున్నారు, ఒంట్లోబాగాలేదా ?

నాగ : కంటితోచూస్తే తెలీదా! పైగా డాక్టరివి.

రమే : అసలు...

నాగ : నాకేం లేదయ్యా.

రమే : చాలా కోపంగా వున్నారే ఈ రోజు. (నవ్వుతాడు)

నాగ : రోగ లక్షణం!

రమే : మందు వేసుకున్నారా?

నాగ : అవసరంలేదు యికనుంచి.

రమే ! (అర్థం చేసుకుంటూ) రాధ!

నాగ : ........

రమే : ఇంటిలో ఉందాండి?

నాగ : ఉండకేం చేస్తుంది. (వెంకన్న కాఫీ పట్టుకొస్తాడు)

రమే : అయితే వస్తా (అని రాధ వెళ్ళిన డ్రస్సింగ్ రూం లోకి వెడతాడు అతను వెళ్ళినవేపే యిద్దరూ చూస్తారు.)

నాగ : చూశావురా, రమేష్ చొరవ.

వెంక : (వ్యంగ్యంగా) ఏంది బాబూ! ఏమీ తెలియనట్లు అడుగుతారు?

నాగ : వెడతాను. ఈ వేషాలు నాదగ్గర సాగవ్. ఈరోజు ఏదో ఒకటి తేలాలి.

వెంక : ఏందిబాబూ తేలేది? ఈ అలుసంతా ఆ అమ్మే యిస్తోంటేను.

నాగ : ఎవరయితేనేం, ఈరోజునుండి వీళ్ళ ఆటలు సాగవు. లోకులు అన్నారంటే ఊరికే అన్నారా! ఛీ! కాస్త సభ్యత వుండక్కర్లేదు.

వెంక : నెమ్మదిగా అంటారేంది బాబూ!

నాగ : లోకంలో ఎంతమంది భర్తలు అవిటివాళ్ళు కావటంలేదు? వాళ్ళ భార్యలు అంతా యిలాగే ప్రవర్తిస్తున్నారా? ఎంత సిగ్గుచేటు.

వెంక : ఇదంతా చూడలేక మన రవయ్య దూరంగా పోయాడు. ఎక్కడున్నాడో ఏమో?

నాగ : సిగ్గులేక మనం యిక్కడ పడివున్నాం. ఈరోజు తాడో పేడో తేలిపోవాలి. మురళి ఏంచేస్తున్నాడో చూడరా.

వెంక : బాబయ్యా! ఆయనెందుకు అసలే ఆరు బెంబేలు పడిపోయారు. రాధమ్మగార్ని ఒక్కసారి మందలించి చూడండి.

నాగ : ఇంకా ఏం మందలింపురా! నా కళ్లెదుటే యిన్ని జరుగుతుంటే. ఆనాడు రవి అంటే వాడేదో ఉద్రేకంలో అన్నాడనుకున్నాను. చివరికి వాడిదారిని వాడు పోయాడు ఇక నేను సహించలేనురా. వాడిని పిల్చుకురా.

[రమేష్ ముందు వస్తాడు. రాధ వెనకాలే వచ్చి వెడుతోండగా]

నాగ : అమ్మాయ్!

రాధ : (వెనక్కి తిరిగి) ఏం! మామయ్యా!

నాగ : ఒక్క మాట యిలా రా. (దగ్గరకువస్తుంది) మురళీ నీతో ఏమైనా చెప్పాడా?

రాధ : ఏ విషయం మామయ్యా?

నాగ: ఏమీ తెలియనట్లు మాట్లాడకు. ఈ విషయంలో ఒక నిర్ధారణకి వచ్చాం. ఇకనుంచి ఈ తిరుగుడు మానెయ్యాలి.

రాధ : మామయ్యా?

నాగ : అవును. ఇది యిప్పట్లో చాలా అవసరం (రాధ చలిస్తుంది. రమేష్ అర్థం చేసుకుంటాడు.)

రమే : అదేమిటండీ ! మీ నిర్ణయాలు చాలా విచిత్రంగా వున్నాయే.

నాగ : అది నీకనవసరం. అమ్మాయిరాదు. నువ్వు వెళ్ళ వచ్చు.

రమే : అనవసరంగా తొందరపడుతున్నారు. రాధ ఆరో గ్యం గురించి ఆలోచించారా?

నాగ : ఆ విషయాలు మేము చూచుకుంటాము. నీ అనుచిత సలహాలతో వేధించక వెళ్ళు.

రమే : అయితే ఈ విషయంలో నిర్ధారణ మీదేనా?

నాగ : మురళితో ఆలోచించే చెబుతున్నాను.

రమే : ఓహో! అయితే వాడినే అడుగుతాను (అని మేడ మీదకు వెళ్ళబోతాడు.)

నాగ : అవసరం లేదు వాడిని అడగక్కర్లేదు. రమేష్ ఎందుకయ్యా నీకింత పట్టుదల! వాడు నీకు ఏం ద్రోహం చేశాడు? వాడి నెందుకిలా చిత్రహింసకు గురిచేస్తావ్? మీ చిన్ననాటి స్నేహాన్ని గుర్తుకు తెచ్చుకో వాళ్ళ జీవితంలో అడ్డురాకు నామాట విని నువ్వు వెళ్ళిపో.

రమే : ఒకళ్ళ బాధతో నాకు పనిలేదు. ఇందులో నా తప్పేం లేదు. చిన్ననాటి స్నేహాన్ని పురస్కరించు కొనే యిదంతా చేయవలసి వస్తోంది.

నాగ : ఛీ! నీకు సిగ్గులా లేకపోయింది ఆ మాట అనడానికి.

రమే : నాకు కావలసింది అనవసర ప్రసంగం కాదు. రాధని ఆపే శక్తి మీకుగాని, ఆఖరికి మీ మురళికిగాని

లేదు. ఆమె మంచి చెడ్డలు ఆలోచించుకునే తెలివి ఆమె కుంది. అది మీరు కాదనగలరా?

నాగ : వెంకన్నా, విన్నావట్రా ఎంతవరకూ వచ్చిందో! సరే ఫర్వాలేదు. ఆఖరిసారిగా అడుగుతున్నాను. (రాధతో) నామాట మన్నించి బయటకు వెళ్ళడం మానాలి. ఈ ఒక్క విషయంమీదే ఈ యింటి భవిష్యత్తు ఆధారపడి వుంటుందని మాత్రం మర్చిపోకు. ఇప్పుడు నువ్వు తీసుకునే నిర్ణయం కొన్ని జీవితాలను నాశనం చెయ్యవచ్చు. లేదా మరికొన్ని వసంతాలను ఈ ఇంట్లో సృష్టించి మోడువారిన జీవితాలను చిగురింపచేయవచ్చు. బాగా ఆలోచించి ఏదో ఒకటి చెప్పు.

రాధ : (కాస్త చలించి) మామయ్యా, నన్ను క్షమించండి.

రమే : రాధా, ఆయననేది... నీ ఉద్దేశం తెలియక అంతే...

నాగ : అంతేనా?

రాధ : (మాట్లాడదు.)

నాగ : మాట్లాడవేం? అయితే అతనిమాట నిజమంటావ్. నన్ను కాదని అతనితో వెళ్ళక తప్పదంటావు. చెప్పు.... చెప్పు.

రాధ : (ఏడుస్తూ) నేనీ చిత్రహింస పడలేను. నేను ఏదీ చెప్పలేను.

నాగ : అమ్మాయి రాధా,

రాధ : మామయ్యా, నామాట వినండి.

నాగ : వినను, వెళ్ళను అను. అంటే కాని ఏదీ వినను.

రాధ : చాలా కష్టం. నా పరిస్థితి అంతా ఇలావచ్చింది మామయ్యా. (అని వెక్కి వెక్కి ఏడుస్తుంది)

నాగ : ఛీ! ఛీ; ఇంతకన్న నాకు వేరే శిక్షలేదు. నా కళ్లె దటే నన్నే కాదని, పెద్దవాడిని బ్రతికుండగా చేయ వలసిన గౌరవం కాదది. రవి చెప్పిన మాటవింటే నాకీగతి పట్టేదికాదు. ఇక ఈనరకకూపంలో ఉండ లేను. ఒక క్షణంకూడా ఉండలేను (అని విసురుగా లోపలికి వెడతాడు)

వెంక : (రమేష్‌తో) రమేషయ్యా...ఆతల్లి బ్రతుకు పాడ వటం మనకి మంచిది కాదయ్యా! ఈ ఇంట్లో అందరూ అల్లా ఎల్లిపోతే ఎల్లాగయ్యా? ఎందు కయ్యా అందర్నీ ఏడిపిస్తావ్? ఊరూకాళ్ళు పట్టుకుంటా కొద్దిగా ఆలోసించయ్యా...

రమే : ఇందులో ఆలోచించడానికి ఏమీలేదు.

వెంక : అంతేనా! (రాధతో) రాధమ్మా! అమ్మా అగ్గి అంటుకుంది. ఇది ఆరిపోతాదో, లేక మంటికి మనల్ని మసి సేద్దో తల్లీ నాకేటో ..

రాధ : (బాధతో) వెంకన్నా!

ముర : (మెట్లు దిగుతూ) రాతిబొమ్మకి తిల కొట్టుకుంటు రక్తం కారటంకన్నా వరాలు ఇస్తుందా వెంకన్నా!

రమే : వచ్చావా! చూస్తున్నావురా ?

ముర : కళ్ళులేవుగా చూడ్డానికి...అదృష్టవంతుడిని.

రమే : ఏమిట్రా అల్లా అంటున్నావ్ ?

ముర : అనేందుకేముంది ఒకటితప్ప నా సహనశక్తి ఎంతటిదో నీకు తెలుసు...అదికరిగి లావాలా ప్రవహించి నాలో అగ్ని గుండాలు వేస్తున్నాయిరా?

రమే : జాగ్రత్తే చెప్తున్నావా ?

ముర : విన్నావా రాధా! నా క్వాలిఫికేషన్.

రాధ : ఏమండీ !

ముర : రాధా! జరిగిన వసంతాలలో వికసించిన హృదయాలను ఏదో లిప్తమాత్రంగా మబ్బులు మూసి వేయలేవు. అకారణంగా ఒకరికి కష్టంకల్గించేశని నువ్వు చేశావనను. కాని నాగరికతలో ఒక అలక్ష్యాన్ని ఏవ్యక్తి, ఏవ్యవస్థ సహించలేవు ఒక దానినిపోతూ తెలిసో, తెలియకో ఆదారి తప్పి అందరికీ దూరంగా ఏకాంతంగాపోతే తోటివాళ్ళు చూస్తూ ఊరుకోరు.

రాధ : నన్ను నమ్మలేర ! నాగురించి మీరు తొందరపడకండి దయచేసి.

ముర : ఏనాడూ లేని నిరాశ, తొట్రుపాటు నీలో ఎందుకు కల్గాలి! ఒకరి కష్టాలు నీవే అనుకొనే నిన్ను అనుమానించను-ఏదోమాయ, చల్లని పిల్లవాయువులు వీస్తున్న సమయంలో వీణవాయిస్తూ రతీమన్మధులు తన్మయత్వం పొందుతున్నప్పుడు, వీణ మీట తెగి

వాళ్ళుపడే ఆ వేదన ఊహిస్తే నీకే తెలుస్తుంది. తెగిన మీటకోసం తపనపడకుండా ఆనందాన్ని పొందే దారి వెతకడంలో ఒకరికొకరు దూరం అవరు అవకూడదు.

రాధ : చెప్పేదేదో సూటిగా చెప్పరా మీరు !

ముర : అయితేవిను. తప్పుచేశావనను. కారణాలు ఏవయినా ఒకప్పుడు నాకు తెలియకుండా ఒక తప్పుచేసి నిన్ను ప్రోత్సహించాను. అది అందరికీ ఇష్టంలేదు. అదే తప్పు నాది కాదని నీమీద రుద్దుతుంది లోకం. అది మంచిదా ?

రమే : నీకూ అదే అనుమానం వచ్చిందా ?

ముర : ఏదిరా ?

రమే : ఎవరో ఏదో అంటారని ?

ముర : పరిస్థితులు పాడయినపుడు .

రమే : ఇంకా ఆస్థితి రాలేదుగా ?

ముర : ఋజువేదిరా ? ఎందర్ని కాదంటావ్ ?

రమే : భయపడుతున్నావ్ !

ముర : అయివుండొచ్చు. కాని పెద్దవాళ్ళు ఏదీ తొందర పడి ఒక మాటఅనరు. (నాగభూషణం తిరిగివస్తాడు) చేతిలో సంచి ఉంటుంది

నాగ : ఇకనుంచి ఆ బాధ ఉండదులే. నేను వాళ్ళకి అడ్డుగా ఉండను. వెడుతున్నాను.

[ వెంకన్న వస్తాడు ]

రాధ : మామయ్యా !

ముర : నాన్నా !

రమే : నాగభూషణంగారూ ! ఆలోచించండి ?

నాగ : నాలాంటి పనికిరాని పెద్ద ఉన్నా లేకపోయినా ఒకటే అయితే అది మురళి గురించి వెళ్ళవలసి వచ్చిందినే భాగ్యమాత్రం మిగిలిపోతోంది ఈ ఇంట్లో నాకు పూర్తి అధికారం లేదని ఈ నాడు తెలిసింది వస్తా.

ముర : నాన్నా! ఏమిటినాన్నా! నన్నుఏంచేసి వెళ్తున్నావు?

వెంక : బాబూ పదండి నేనూ ఈడ ఉండలేను. ఎక్కడికో అక్కడికి పదండిపోదాం!

ముర : ఆగు వెంకన్నా! (రాధతో) రాధా! నాన్నగార్ని గాయపర్చిందేమిటో తెలుసా! ఆయనమాట నువ్వు వినకపోడం ?

రాధ : ఏమిటండీ నేను....

ముర : ఒద్దూ అన్నపని చేయడం. కాదని బ్రతిమాలినా మాటతోసిపుచ్చి విచ్చలవిడిగా తిరగడం. మా కన్న మంచిచెప్పేవాళ్ళు వేరేఉన్నట్లుమాట్లాడడం. ఇవన్నీ ఏమిటి ?

రాధ : నేను ఏదీ చెయ్యలేదు కదండీ ?

రమే : ఆహా! చేస్తావేమోనని, అంతే కదూ మురళీ ?

ముర : నీజోక్యం అనవసరం.

రమే : ఊరుకుంటాను. కాని రాధకి అర్థం అవలేదేమోనని చెప్పాను.

—

ముర : రమేష్! నీపద్ధతి బాగులేదు.

రమే : ఏంచేశాను ?

ముర : ఏం చెయ్యాలి? చేసింది చెప్తే వింటావా ? తేలిగ్గా నమ్మించి నామంచికోరే రాధని నాకు దూరం చేశావు! నల్గురి ఎదుటా మీరా ఇద్దరూ..

రాధ : ఏమండీ !

ముర : రోగం పేరుచెప్పి వెళ్ళింది? ఎవరితో ఆస్పత్రికి ఏనాడయినా సాక్ష వెళ్లిందా? ఎక్కడికి వెళ్లిందనే వాళ్ళకిచ్చే జవాబు ఏది ? ఇదంతా ఏమిటి అన్న నాతండ్రిని అవమానించిందెవరు? దీనికంతకీ ప్రోత్సాహమిచ్చిందెవరు? నువ్వు కాదు రమేష్ ?

రమే : కాదు. నీకోసం, రాధకోసం కొన్ని కారణాల వల్ల అలాచేయక తప్పలేదు.

ముర : ఎందుకని? ఎవరిచ్చారు అధికారం? రాధ ఇచ్చిందా?

రమే : అవును.

రాధ : రమేష్! ఏమిటిదంతా ?

ముర : (వెక్కిరింపుగా) కాలేజి నాటి పరిచయం. మధ్యలో వచ్చిన అవరోధం ఆసరాగాతీసుకొని ఆడే నాటకం.

రమే : కొంత నిజం లేకపోలేదురా ?

ముర : రాధా! విన్నావా ?

నాగ : నాయనా! మురళీ ఇవన్నీ నేను భరించలేను. ఈ

పాపం నా చెవులారా పడి ఇంకా ఎల్లా ఉండగల నురా ఇక్కడ?

ముర : తమ్ముడు దూరమయ్యాడు నువ్వూ అవుతావా నాన్నా! మనసారా ప్రేమించి అన్నీ నావే అను కున్న నా రాధ ఈనాడు నాదికాదని తెలిసి కూడా వెడ్తావా? అంతకాదని వెడ్తావా నాన్నా!

రాధ : ఏమండీ! నామాట వినండి. నేను...

ముర : వినకుండా చెడిపోయాను. ఆనాడే వెళ్లనని అన్న ప్పుడే వెళ్లమని ప్రోత్సహించడం నేను చేసిన అప చారం. అదే అదనుకోసం కూర్చున్న మీఇద్దరికీ మంచి ఉపకారం జరిగింది. అవునా!

రాధ : కాదు.

రమే : వాడి మాటలకి అసలు అర్థం లేదు.

ముర : (కోపంగా) రమేష్! దేవుడిచ్చిన జ్ఞానేంద్రియాలలో కళ్ళులేకపోయినా మీఇద్దర్ని అర్థం చేసుకోలేనను కోకు. అన్నీ తెలిసి కళ్ళారా చూసి నెత్తిబాదు కొని రవి ఎందుకు నాకుదూరంగా పారిపోయాడు? అసలు ఈ రగడకి కారణం ఎవరో కాదు నువ్వే?... నాస్వార్థం నాకళ్లకి తెరలుకట్టి రాధని నీకు కాకుండా చేశాననే కటకొద్దీ; నారాధ మనస్సు విరచిన నిన్ను ఏనాడూ క్షమించను, దయచేసి ఇక్కడున్నుంచి వెళ్ళిపో! ఫో,

రమే : తప్పదంటావా ?

మురా : పొమ్మని పదిసార్లు చెప్పాలా! పోనీ నేనయినా పోతాలే మీ ఎదుట్నుంచి (అని మెట్లుకేసి వెడతాడు)

రాధ : ఆగండి! మీరు వెళ్లకండి. నామాట వినండి.

రమే : రాధా!

రాధ : రమేష్! చెప్పనియ్యి ఆయనికి చెప్తేకాని....

రమే : ఇప్పుడు వాడు ఏది చెప్పినా నమ్మలేడు.

ముర : బాగా చెప్పావ్! పొంగేపాలల్లో ఉప్పురవ్వ వేసే నీలాంటి పయోముఖ విషకుంభాలు అంతకన్న ఏమంటారు? ఒక పచ్చని సంసారంలో చిచ్చు రేపే పాపిష్టితో చెలిమి నన్ను ఇంత నాశనం చేస్తుందనుకోలేదు. చాలు రమేష్ చాలు.

రాధ : అతను మీ కోసం....

రమే : రాధా !

ముర : చూపులేదు, చేతకాదు అనుకునేగా మీఇద్దరూ కలిసి మాట్లాడేది. రాధా! ఒక నాటిమాట గుర్తు చేస్తాను. విను "మీకు విజ్ఞానం ఉంది. ఆవిజ్ఞానం మాకుచూపించలేరా కళ్ళు లేకపోయినా"అన్నావు. అదే తెలివి నాకులేదని ఇప్పుడు నానోరుమూయిస్తే వచ్చే ప్రయోజనం.

రమే : ఉద్దేశంలోని అర్థం చెప్పినా అర్థంకాదు.

ముర : నిజమేరా రమేష్! ఏరుదాటాక పడవతగలెయ్యడం తెలిసే! నీలోదాగిన పాతకాలపు పగ పరోక్షంగా తీర్చుకుంటున్నావు! సమయంచూసి ప్రారంభించావు నీ ఆటలు.

రమే : పొరబడుతున్నావు! కావాలనుకుంటే రాధని ఇప్పుడే కాదు. ఆరోజున నీకు కట్టపెట్టే వాడినేకాదు. గుర్తుందా ?

ముర : అంత ధైర్యం ఉందన్నమాట. అయితే రాధ నీమాట వింటుందంటావు ?

రమే : అవును.

ముర : రాధ ! దాచినా దాగని నగ్నసత్యం విన్నావా ! నీలో ఏలోపం లేదనగల ధైర్యం ఉందా ?

నాగ : నాయనా; ఎందుకొచ్చిన మాటలురా; జరిగేదేదో జరక్కమానదు. వాళ్లను....

రాధ : నా తప్పేమీ లేదండీ! నేనేం చెయ్యలేదండీ! కాని మీకోసం .. మీ కళ్ళకోసం నేను పడే ఆవేదన మీకు తెలియదు.

ముర : అందుకోసం నీవు చేసే పనేమిటి!

రాధ : మంచిపనే అనుకుంటున్నాను.

ముర : నీనమ్మకాన్ని కాదనను. కానీ నీతో పదిరోజుల క్రితం ఇల్లువదలి వెళ్ళవద్దని నేను చెప్పాను. ఆనాడు 'సరే' అన్న నీమాట నాకెంతో ధైర్యం ఇచ్చింది. కాని నాన్నగారు చెప్పలేక చెప్పినా చివరికి నీ పాత

పాట మానకపోతే ఇంటి పెద్దగా శాసించినా ఎదురు తిరిగి ఆయన్నే అవమానపర్చావ్! పైగా రమేష్ మాటలకి ప్రక్కతాళం వేస్తో నా ఎదుటే ఈ ఇంటి గౌరవం నీ గౌరవం నీచాతినీచంగా దిగజారిపో తుంటే చూస్తూ ఊరుకున్నావ్! నీవు చేసేపని ఎంత మంచిదో తెలుసా!

రాధ : తెలుసు. మిమ్మల్ని మనసారా ప్రేమించాను. కోరు కోని మీ యింటికి వచ్చాను. కాని మీ జీవితంలో అనుకోకుండా అడ్డువచ్చిన గుడ్డితనం నా భవిష్య త్తులో ఒక దెబ్బగా నిల్చింది.

మురళి : (పిచ్చిగా) ఇహ చాలు ఆపు. హద్దులేకుండా విచ్చలవిడిగా పెరిగిన మీ ఇద్దర్నీ ఎవ్వరూ క్షమిం చరు. నాన్నా! దయచేసి వాళ్ళ ఇష్టంవచ్చినట్లు పోనీ! వాళ్ళని ఆపవద్దు. కాలచక్రంలో నాలాంటి అసమర్థులు వేసిన ఒక తప్పటడుగు కొందరి ప్రాణాల్ని బలికోరతాయి. నా కోసం, నా మర్యాద కోసం, తన చిన్నారి జీవితాన్ని చిత్రవధకి గురిచేసు కున్న రవిని దూరంచేసుకుంది నేనే నాన్నా! (అంటూ ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ) అమ్మలేని అనాథులను కళ్ళలో పెట్టుకొని పెంచిన నాన్నా! నా అసమర్థతకు మన్నించు. మాయని మచ్చ మన కింక తప్పదు. సిరిగలకోడలని మురిసి ఆనందించిన కోడలు నిన్నే మోసంచేసింది నాన్నా!

9)

నాగ : ఇదంతా నా ఖర్మ.

వెంక : బాబయ్యా! ఏటండీ మీరుకూడా!

రాధ : (ఏడుస్తూ) లేదండీ! నా పరిస్థితి మీ కర్థంకాదు. ఏదీ చెప్పక కుమిలిపోయే నన్ను ఇంకా చంపకండి. రమేష్ ఇక ఈ బాధ భరించలేను వారికి చెప్పి...

రమే : ఆ అవసరం లేకుండా వాడు చెప్పేది వింటే నీకే తెలుస్తుంది తొందరపడకు.

ముర : రమేష్! రాధ నీదని నేను చెప్పాలా! అది నా నోటి నుంచి వింటావా? వినాలని ఉందా? విని సంతోషి స్తావా? రాధా! తెగేదాకా తెంపకు. వెళ్ళు. త్వరగా పో....

రాధ : నేను వెళ్ళను....నేను ఎక్కడికీ వెళ్ళలేను. (అని ఏడుస్తోంది)

ముర : రాధా! (అని బిగ్గరగా అరచి మెట్లు దిగబోయి) నీలాంటివాళ్ళను భగవంతుడు క్షమించడు. రాధా! నేనే పోతాలే. నువ్వే ఉండు ఈ ఇంట్లో.

రాధ : ఆగండి! రమేష్ వారికి....

ముర : రమేష్! ఆగు. మీ రిద్దరూ నాశనంఅయిపోతారు. తప్పదు.

నాగ : నాయనా! మురళీ! (అని నెత్తి బాదుకుంటాడు)

వెంక : బ బుగోరూ!

రాధ : మామయ్యా!

నాగ : నాకు చావు చప్పునరాదు.

ముర : వస్తుందిలేవయ్యా! నాన్నా! నా తర్వాత నీదే వంతు భయపడకు రవి మనల్ని మట్టిచేసాడులే.

రాధ : ఏమండీ! ఏమిటండీ మాటలు

ముర : ఛీ! నన్ను పిలవకు....పిలిచి రెచ్చగొట్టకు. (అంతలో బయటనుండి 'టెలిగ్రామ్' అని వినబడగా రమేష్ వెళ్ళి తీసుకువచ్చి చించి బిగ్గరగా చదువుతాడు. "Ravi Committed Suicide" Rama Rao.

నాగ : (వెర్రిగా) నాయనా! రవీ! ఎంతపనిచేశావు నాయనా! రవీ! బాబూ (అని సోఫాలో కూలబడతాడు)

ముర : రవీ! (అని మెట్లమీదనుంచి వెర్రి ఆవేశంలో) రాధా! రవి చచ్చిపోయాడు నువ్వే కారణం; నువ్వే కారణం. నిన్ను ఇక వదలిపెట్టను. (అని మెట్లమీద నుండి దిగబోయి జారిపడిపోతాడు)

రాధ : ఏమండీ!

రమే : మురళీ!

వెంక : సినబాబు, సినబాబు

ముర : (తలపగిలి రక్తం కారుతుండగా) రవి చచ్చిపోయాడు. రాధ బతికుంది అల్లా వీల్లేదు. (అని తల నేలకేసి బాదుకొని పడిపోతాడు.)

రాధ : అతనిమీద పడి) ఏమండీ!

రమే : వెంకన్నా! చప్పుని ఇల్లా రా.

— తెర —

# 5 వ రంగం

[రంగం మామూలే]

సమయం : సాయంత్రం

[తెర లేచేసరికి నాగభూషణం సోఫాలో కూర్చొని వుంటాడు. కాస్త దూరంగా వెంకన్న కూర్చుని ఉంటాడు. బుక్ షెల్ఫును అనుకొని రాధ నుంచుని వుంటుంది ]

వెంక : బాబుగోరూ....

నాగ : ............

వెంక : (దగ్గరకి వచ్చి) బాబుగోరూ.

నాగ : (ఉలిక్కిపడి) ఆ!........

వెంక : నాకు తెలియక అడుగుతాను. సినబాబుని ఆస్పత్రి నుంచి తీసుకువచ్చారుగందా, ఇంకా కళ్ళకి ఆ పీచుగుడ్డ తియ్యలేదేం బాబూ!

నాగ : ఇప్పుడు తీస్తారు. రమేష్ మేడమీదకు వెళ్ళాడుగా!

వెంక : రమేషయ్యా మా కట్టపడుతున్నాడు బాబూ! సిన బాబుకి కళ్ళు ఒత్తాయా బాబూ!

నాగ : వెంకన్నా! చిన్నప్పట్నించి వాడి మంచిచెడ్డలు చూస్తూన్నావు. ఒక్క విషయం అడుగుతాను చెప్పు.

వెంక : ఏంది బాబూ?

నాగ : బుద్ధి తెలిసిన తర్వాత నా మురళి ఎవరికయినా కనీసం విరోధులకయినా అపకారం తలపెట్టాడా? ఎవరి మనస్సయినా గాయపడేలా ప్రవర్తించాడా! అంతెందుకు మొన్న సంఘటన.

[రాధ కలవర పడుతుంది]

వెంక : (రాధని చూసి) పోనీండి బాబూ! అదొ్కుకు ఇప్పుడు ఆ ఏడుకొండలాడి సూపు సల్లగా ఉండి, మా అయ్యకి సూపొస్తే (షెడమీద ఏదో అలికిడి వినిపిస్తుంది. రమేష్ వస్తున్నాడని అందరూ మెట్ల దగ్గరికి వస్తారు. వెంకన్న మెట్లమీద చూసి, దాని తస్సాదియ్యా! పాడుపిల్లి ఎంత గడబిడ చేసింది.

నాగ : ఏమిటో గానీ నేనింక ఓర్పుపట్టలేనురా!

రాధ : మామయ్యా! కాస్త ఆగండి రమేష్ చెప్పింది విన్నారుగా? వారి బేండేజీ తీసేసరికి వారికి దేన్ని చూడాలని ఆతృతగా ఉంటుందో ఎదురుగా అదే ఉండాలి.

వెంక : నిజమే బాబూ! రోజూ పెద్ద అమ్మగారి ఫొటో చూసి దండం పెట్టందే బయటికి వచ్చేవారు కాదు.

నాగ : అవున్నా నిజమే!

[రమేష్ చేతులు తుడుచుకుంటో మెట్లు దిగుతాడు. అంతా అతన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తారు.]

రాధ : వారికి....

నాగ : నా మురళికి....

వెంక ; సినబాబుకి...

రమే : ఈ సంతోషసమయంలో నాకు ఎట్లు చెప్పాలో తెలియడంలేదు. ఒక్కమాటలో చెప్పాలంటే.... నా కృషి ఫలించింది.

రాధ : అయితే వారి చూపు (అంటూ మేడమీదికి వెడుతుంది)

నాగ : ఏడీ నా బాబు... పదరా వెంకన్నా! (అని వెళ్ళబోతారు)

రమే : (వారిస్తూ)మీరంతా కలిసి వాడినికంగారు పెట్టకండి. కాస్తంత విశ్రాంతి అవసరం.

వెంక : బాబూ! ముందు ఆ ఏడుకొండలాడితో చెప్పొదాం రండి!

నాగ : అవున్రా! ఇదంతా నా స్వామి కటాక్షం. పదరా! (అని ఇద్దరూ వెడతారు గదిలోకి మురళి నెమ్మదిగా వస్తూ ఏదో వెతుకుతున్నట్లుగా చూస్తో మెట్లు దిగుతాడు)

ముర : చాలమార్పు... కొన్ని నెలల్లో ఎంత మార్పు. (రాధ అతని వెనుక నెమ్మదిగా మెట్ల మీదనిలబడుతుంది)

రమే : ఎన్ని మార్పులు, ఎన్ని కష్టాలు లేందే ఈ గండం గడిచి బయటపడిందిరా! రా! కూర్చో నీతో కొన్ని ముఖ్య విషయాలు మాట్లాడాలి. (రాధని చూసి) అరె! రాధా! అల్లాగ నిలబడిపోయావేం, ఈ సంతోష సమయంలో కొంచెం కాఫీ అయినా ఇస్తావా లేదా!

[రాధ మాట్లాడదు. మెల్లగా మెట్లుదిగి మురళి ప్రక్కగావచ్చి నిలబడుతుంది. ఆమెను చూసి మురళి మాట్లాడడు.]

వెంక : (వస్తూ) మురళిబాబూ!.... బాబూ .... సినబాబుకి కళ్ళు వచ్చాయి ... నా బాబుకి కళ్ళు వచ్చాయి.

నాగ : ఏదిబాబూ .... మురళీ నన్నొకసారి చూడు .... వీళ్ళంతా మామూలుగా కనిపిస్తున్నారా! మన వెంకన్న ...వెంకన్న చూడు, ఎలా నీరసించి పోయాడో. (రాధని చూసి ఏదో చెప్పాలనుకొని చెప్పక ఊరుకుంటాడు.)

ముర : వచ్చాయి నాన్నా! మిమ్మల్నందర్నీ మామూలుగా చూడగలను. కాని రవినే చూడలేను నాన్నా. ఇప్పుడు నేను చూస్తున్నది నా కళ్ళతో కాదు నాన్నా! ఇవి చాలా కృత్రిమంగా వచ్చాయి. ఈ కృత్రిమ వాతావరణం చూడడాన్కి ....

రమే : మురళీ! బాగుందిరా వరస! అనవసరంగా బాధ పడకు. నీకు విశ్రాంతి అవసరం. రాధా! వాడ్ని

లోపలికి తీసుకు వెళ్ళి కొంతసేపు రెస్టు తీసుకొనేటట్టుచూడు. మిగతా విషయాలు నేను చూసుకుంటాను. (రాధ మాట్లాడదు. మురళికేసిచూస్తుంది)

ముర : రాధ నా విశ్రాంతి కొరకు శ్రమపడాలా! అవి పాత రోజులు రమేష్! ఇప్పుడు నా విశ్రాంతి నేను చూసుకోగలను. మీ అందరి కృషివల్లనాకు క్రొత్త కళ్ళు వచ్చాయి. ఇందులో నీ సహాయాన్కి నా కృతజ్ఞత...

రమే : (నవ్వుతూ) బాగా చెప్పావురా.... చాలా తేలికగా...

వెంక: మురళిబాబూ! ఈ ఇసయాలు అన్నీ ఆనకమాట్లాడుకోవచ్చు. మీరు విశ్రాంతి తీసుకోండి బాబూ!

నాగ : అవున్రా మురళీ! గడచిన జ్ఞాపకాలతో బాధపడకురా! నీకళ్ళు వచ్చాయి, అంతే చాలు. అన్నివిషయాలు అవే సర్దుకుంటాయి అదంతా నామీద వదలెయ్యి!

ముర : నాన్నా! క్షమించండి. ఈ విషయాలన్నీ ఒక నిర్ణయాన్కి రాందే నాకు విశ్రాంతి ఉండదు. నాకు కళ్ళుండీ లేనట్లే. (ఒక క్షణం నిశ్శబ్దం. రమేష్ ఏదో చెప్పబోతాడు. మురళి వారిస్తాడు.) రాధా!.. రమేష్. మీ ఇద్దరూ బాగా వినండి. నా కళ్ళతో పాటు మన జీవితానుబంధం కూడా తెగిపోయింది రాధా! తిరిగి నాకళ్ళువచ్చేసరికి నీవుమరోమార్గాన్ని

పయనించి కృతకృత్యురాలు వయ్యావని తెలుసు
కొని సంతోషిస్తున్నాను.

రమే : మురళీ! ఏమిట్రా అర్థంలేని తొందర. అసలు జరి
గిందంతా నేను చెప్తాను. వినరా!

ముర : ఎవ్వరూ చెప్పవలసింది ఏమీ లేదురా! నా నిర్ణ
యాలు నీకు బాగా తెలుసు.

రాధ : (అంతవరకూ నిశ్చలంగాఉన్న స్థితినుండి తేరుకొని)
రమేష్! వారి మనస్తత్వం నాకు బాగా తెలుసు.
అందుకే ఈ నాటకంలో పాత్రధారిని కాలేను అని
చెప్పాను. ఒక ప్రక్క నీప్రోత్సాహం, మరో ప్రక్క
వారికి కళ్ళు వస్తాయనే ఆశ,నన్ను నాటకానికి పురి
గొల్పాయి. అయినా నేను నటిసున్న కాలంలో నా
మనస్సు గాలివానకు గురయినచిగురుటాకులా కొట్టు
కొంది. ఇందులో నాకొక తృప్తిమాత్రం ఉంది.
నేను పడిన శ్రమ వృథా కాలేదు. (మురళితో)
చూడండి. ఒకసారి నావైపు చూడండి. (మురళి
చూస్తాడు రాధ సూటిగా చూస్తో) ఇందులో మీా
తప్పు ఉందనను. కాని ఒక్కమాట మాత్రం అన
కండి. లోకం అంతా అన్నా భరించగలనుగాని
మీారు మాత్రం అనకండి. (ఏడుస్తో) కావాలంటే
మీారు విధించే ఏ శిక్షయినా హాయిగా భరిస్తాను.
నేను మీారనుకున్నంత నీచంగామాత్రం ప్రవర్తించ
లేను. ఈ విషయంలో మాత్రం నన్ను నమ్మండి.

ఎల్లాగూ మీ నిర్ణయం ప్రకారం దూరమవుతూ ఉన్నాను. మీ మనస్సులోంచి ఆ ఊహ మాత్రం పార ద్రోలండి. మీ పాదాలుపట్టుకొని ప్రార్థిస్తాను.

రమే : ఎందుకు రాధా! అంత తొందర పడతావు. మురళీ! నిన్ను నేను నమ్మించగలను రా! ఈ ఉత్తరాలు చూడు అంతా నీకే తెలుస్తుంది. (ఉత్తరాలు ఇస్తాడు)

నాగ : అంతా అయోమయంగా ఉంది. చివరికి ఉన్నమతి కూడా పోయేటట్టుంది.

రమే : (మురళి దగ్గరకు వెళ్ళి) ఈ ఉత్తరం బెనర్జీ నాకు వ్రాసినవి. ఇదిగో ఈ ఉత్తరం రాధకి నేను వ్రాసింది.

రాధ : అవునండీ! ఈ ఉత్తరాలు చూసయినా అసలు విషయం గ్రహించండి ఆరోజు ఈ ఉత్తరాలు చూపి రమేష్ నన్ను ఈ నాటక మాడమని ప్రోత్సహించాడు. నాకు తెలుసు దానివల్లవచ్చే పరిణామాలు. కాని అప్పట్లో మీకు కళ్ళువస్తాయనే ఆశతో వెనకా ముందూ ఆలోచించ లేక పోయాను. ఫర్వా లేదు. మీకు కళ్ళు వచ్చాయి. అంతేచాలు. నేను వెడతాను. (కొద్దిగా ఆగి) మీరు పొరబాటు పడిన మరోమార్గం కాదు నా మార్గం వేరే ఉంది. (అంటూ లోపలికి వెడుతుంది)

రమే : ఏమిట్రా? అల్లా రాయిలా నిలబడ్డావ్ ? రాధ వెళ్ళి పోతోందిరా! (మురళి మాట్లాడడు) నాగభూషణం

గారూ మీరయినా చెప్పండి. ఇందులో ఆమె తప్పేంలేదు. (మురళి చేతిలోని ఉత్తరాలు తీసుకొని) ఇదిగో ఈ ఉత్తరం చూడండి మురళీ! అసలు నీకళ్ళు పోడానికి కారణం ఆ కారుప్రమాదం ఒక్కటేకాదు. అతి విచిత్రమయిన పరిస్థితిలో పసిపాపను రక్షించాలనే తహ, తహాలోని శక్తి అంతా మెదడులోని నరాలలో కేంద్రీకరించి అచేతనంగా కారు ప్రక్కకు పట్టించావ్! ఆ చిత్రం నీ మెదడులో మారకుండానే కారు తలక్రిందులయి, తలకి బలమైన గాయం తగిలింది నరాలకు తీవ్ర సంచలనంకల్గి, మెదడంతా బీభత్సంతో ఒక్కసారి Blank గా మారింది దాంతో Partial Blindness ఎంత ప్రయత్నించినా కళ్ళు రాకపోయే సరికి బెనర్జీతో ఉత్తరాలద్వారా Consult చేయగా అతను ఒకసారి ఈ ఉత్తరం వ్రాస్తూ జరిగిన కారు ప్రమాదం వంటి మరొక కృత్రిమ వాతావరణం కల్గిస్తే, జరిగే ప్రమాదంలో కళ్ళురావచ్చునన్నాడు. అందుకు రాధని నీకు దూరంచేసి, అనుమానించేటట్టు చేశాం. రవి ఆత్మహత్యతో నీలో పైకి కనబడని ఆవేశంలో మెట్లమీదనుండి క్రిందపడ్డావ్. ఇదీ సంగతి. (అని అందరికేసి చూస్తాడు. ఎవ్వరూ మాట్లాడరు) అయితే మీరు నన్ను నమ్మరన్న మాట. అన్యాయంగా ఆ అనాథయువతి నా పరిశోధనకి బలికావలసిందే నన్నమాట. మురళీ! ఆలో

చించు, నీకోసం రాధ చేసిన త్యాగం. ఆరోజు ఆమె తాతగారికి ఇచ్చిన వాగ్దానం. (సూటిగా మురళి కేసి నడుస్తూ) మురళీ! జీవితంలో తప్పటడుగులు వేస్తున్నావు. దీని ప్రభావం నీవు జీవించినంత కాలం నిన్ను బాధ పెడ్తుంది. నమ్మరా! నన్ను నమ్మరా! రాధని వెళ్ళనివ్వకురా (రాధ లోపలినుండి వస్తుంది. చేతిలో ఫొటో ఉంటుంది. మాట్లాడాలను కుంటుంది కాని మాట్లాడదు. ఒక అడుగు ముందుకు వేస్తుంది) రాధా! ఆగు నాబొందిలో ప్రాణం ఉండగా నీకు నేను ఏ ఆపదా రానివ్వను. (అంటూ మురళివైపు పోబోతాడు.)

రాధ : రమేష్! అనవసరంగా వారిని శ్రమపెట్టకు. నాకు కావల్సింది వారి క్షేమమే. అంతకు మించి నాకు కావల్సింది లేదు. నీవు ఇంత కాలం నాపట్ల చూపిన ఆదరణ, వారికోసం పడినశ్రమకి నీకు నేను ప్రత్యుప కారం ఏమీ చెయ్యలేను కాని ఏనాటి కయినా నిజం తెలుసుకుని వారు చెయ్యగలిగింది చాలఉంది. అది తప్పక వారు చేస్తారని ఆశిస్తాను. (నాగభూష ణంవైపు తిరిగి) మామయ్యా! నాకు తండ్రిలేని లోటు తీర్చారు. ఇంతకాలంగా నాపట్ల చూపిన ఆదరణ మర్చిపోలేను. (వెంకన్నతో) ఇక వారి భారం నీదే వెంకన్నా!

వెంక: అమ్మా! ఏటమ్మా ఇదంతా ఇట్టా జరక్కూడదమ్మా! (నాగభూషణంతో) ఏంది బాబూ ఇదంతా! ఆ

అమ్మ ఎల్లిపోతోంది. ఈ ఇంటి దీపం ఎల్లిపోతోంది.
రమేషయ్య సెప్పింది నిజంగానే అనిపిస్తోంది.

నాగ : నేనేం చెయ్యను రా! నేను సిలానే ఉన్నాను. ఏది నమ్మాలో ఏది నమ్మకూడదో అర్థం కావడంలేదు.

రాధ : మామయ్యా! అనవసరంగా బాధపడకండి. ఇకనుండి వారికి ... (మాట్లాడలేక నోట్లో చీర కొంగు పెట్టుకొని ఏడుస్తో బయటికి పరిగెడుతుంది.)

రమే : (కలవరంతో) మురళీ! రాధ వెళ్ళిపోతోందిరా! (మురళి మాట్లాడడు) సరే! అర్థమయ్యిందిరా! నిన్నెవ్వరూ క్షమించరురా! దానికి తగిన ప్రాయశ్చిత్తం అనుభవిస్తావ్! అది తప్పదు. (అంటూ రాధ వెళ్ళినవైపే వెడతాడు)

నాగ : బాబూ! మురళీ!

ముర : (పొంగిపొరలే దుఃఖంతో ఒక్కసారి నాగభూషణం గార్ని కౌగలించుకొని పసిపిల్లవాని మాదిరి) నాన్నా ....నాన్నా! నా రాధ ...రాధ. ఈ ఇంట్లో రాధ లేదు. ఇక అంతా చీకటే. చీకట్లో ఉన్న నన్ను మీరంతా కలిసి వెలుగుల్లోకి తెచ్చారు. కాని నాకు మీరు ప్రసాదించినది నిజమైన వెలుగు కాదు నాన్నా! .. చీకటి చూడలేని వెలుగు.

నాగ : బాబూ! చూడు బాబూ! చీకటి వెలుగుల కలయిక లేందే జీవితంలేదు ఇటువంటి పరిస్థితుల్లోనే గుండె రాయి చేసుకోవాలి. అయినా రాధ విషయంలో నీ నిర్ణయం.... ...

రవి : (విసురుగా వచ్చి) చాలా తప్పు నిర్ణయం. రాధ వదిన మన ఇంటి దీపం.

నాగ :
ముర :
వెంక:
) రవిని చూసి తెల్లబోతారు. అదో మాదిరిగా చూస్తారు. ఎవ్వరూ మాట్లాడరు.

రవి : ఎందుకలా ఆశ్చర్యంగా చూస్తారు (మురళి దగ్గరికి వెళ్ళి) నేను....రవిని . అన్నయ్యా . నీ తమ్ముడ్ని.

ముర : (రవిని కౌగలించుకొని) తమ్ముడూ రవీ ... ఏమిట్రా ఇదంతా.. ఎక్కడున్నావు ఇన్నాళ్ళు.

రవి : అన్నయ్యా!... (ఆనందంగా) నీ కళ్ళు వచ్చాయా అన్నయ్యా !

నాగ : రవీ! బాబూ .. అన్నయ్య కళ్ళు వచ్చాయి. ఎక్కడున్నావురా ఇన్నాళ్ళు....వెంకన్నా మన రవిరా.. రవి ?

వెంక: రవయ్యా ...ఏంది బాబూ ఇదంతా.. ?

రవి : వచ్చాను ...అన్నయ్యా ...వదిన....?

ముర : వదిన . రాధ వెళ్ళిపోయిందిరా !

రవి : నాకంతా తెలుసు అన్నయ్యా! వదినకు వచ్చిన భయం ఏమీ లేదు. ఇదంతా ఒక కల. జీవితాన్ని కప్పుకొన్న కారుమబ్బుల్లోంచి బయట పడేటప్పుడు మరో చిన్నమబ్బు చుట్టుముట్టింది. అంతే....

నాగ : ఏమిటి రవీ! సరిగా చెప్పు. రాధ....

రవి : ఎక్కడికి వెడుతుంది నాన్నా! కాని మీరు మాత్రం. ఆవిడ్ని, పిచ్చిదానిగా చేశారు. ఏవో కథల్లో చది

వాను గాని, ఒక మహాపతివ్రత ఆమె భర్త కళ్ళను సాధించడం కోసం, తన పరువు-ప్రతిష్ఠలను పణంగా ఒడ్డిందనే నిజం ఈనాడు వదిన రుజువు పరిచింది. చిన్నవాడిని వెనకా ముందూ ఆలోచించక, అన్న మాటలకి బాధపడక కార్యసాధనకి ఎన్నో అప వాదులకు గురయి, ఇంటా బయటకూడా ఎనలేని సంక్షోభాన్కి గురయి, చివరికి కట్టుకున్న భర్త కూడా ఆమెని అర్థం చేసుకోలేనప్పటికీ, వెయ్యి దేముళ్ళకి మొక్కుతున్నది. కోరుకున్నది ఆమె భర్త కళ్ళు రావాలని. వచ్చాయి.... కాని....

వెంక: రవయ్య సెప్పింది సత్తెం బాబూ! ఆ అమ్మ మీ కోసం, మీ కళ్ళకోసం ఎన్ని బాధలయినా సహిం చింది.

రవి : అన్నయ్యా! రమేష్ నిజంగా దేముడు. స్నేహంలో ఉండే పవిత్రత అంటే ఏమిటో నీకూ తెలుసు. నీ కోసం నింద భరించడానికయినా వెనకాడని సత్పు రుషుడు. వీరిద్దరి తోడ్పాటు లేకపోతే నీకు తిరిగి చూపురావడం కల్ల. నన్ను నమ్మ అన్నయ్యా! జరిగిన విషయం ఒక నటన అన్నయ్యా....

నాగ : మురళీ! రమేష్ చెప్పింది నిజమనిపిస్తోంది. నీ కోసం వాళ్ళీ నాటకం ఆడారురా.... రవీ! అమ్మాయి రాధ.

రవి : మన తోటలో కూర్చోపెట్టి వచ్చాను. రా నాన్నా (అంటూ రవి, నాగభూషణం, వెంకన్నా వెడతారు)

[మురళి ఒంటరిగా మిగిలి ఎటూ తెగని ఆలోచనలో ఉండగా లోనుండి]

నాగ : రమేష్ చెప్పిందంతా నిజమే....నీ కోసం వాళ్ళు నాటకం ఆడారు. (Repeat)

వెంక : రవయ్య సెప్పింది అంతా సత్తెంబాబూ! ఆ అమ్మ మీ కోసం, మీ కళ్ళకోసం ఎన్ని బాధలయినా సహించింది. (Repeat)

రమే : మురళీ! జీవితంలో తప్పటడుగులు వేస్తున్నావ్.... నన్ను నమ్మరా....నన్ను నమ్మరా.... (Repeat)

రవి : అన్నయ్యా...రాధ వదిన మన యింటి దీపం. రాధ వదిన మన ఇంటికి దీపం. అన్నయ్యా....

[మాటలు వినవస్తున్నంత సేపు మురళి కలవరపడుతూ క్షోభతో, స్టేజి అంతా కలయతిరుగుతాడు. రవి మాటలు వినబడుతుండగా ఒక నిశ్చయానికి వచ్చిన వాడిలా....]

ముర : (ఆవేశంగా అతృతగా) రాధా. ..రాధా....రమేష్. (అని తోటలోనికి పరిగెడతాడు.)

— తెర —

సమాప్తం



అసలు పేరు : పీసపాటి శేషాచల శాస్త్రి.

జననం : 28, అక్టోబరు 1932.

అందరికీ "శేషుబాబు" గా పరిచయం. కథకుడు, నాటక రచయిత, నటుడూ, దర్శకుడూను. కథలు వ్యాసాలు వ్రాసే అభ్యాసం చిన్నతనం నుంచీ వుంది. వీరు వ్రాసిన నాటకం "సంస్కారం" 1956 లో శ్రీ జగ్గయ్యగారి అధ్యక్షతన ప్రదర్శింప బడింది. ఆ తరువాత వరుసగా 'చీకటి – వెలుగులు' 'నిష్కృతి' 'చివరకు మిగిలేది' అనే నాటకాలు, నాటికలు వ్రాశారు. కథా విధానంలో కొత్తదనం, సంభాషణలలో చురుకుదనం వీరి రచనల్లో కనిపిస్తాయి. నాటకాలలో 'సస్పెన్స్' ను పోషించాలనే ఉత్సుకత 'విషవలయం' అనే నాటక రచనకు దారితీసింది. రవీంద్ర కళా కేంద్రం వారిచే ప్రదర్శింపబడిన ఈ నాటకం పలువురి ప్రశంసలను అందింది.

యువకులు, భవిష్యత్తులో ఇంకా మంచి రచనలు చేస్తారని ఆశించవచ్చు.

రైల్వే ఎకౌంట్సు డిపార్టుమెంటులో వుద్యోగం. సికిందరాబాదులో నివాసం.

PRINTED AT 'VENKATARATNA' V. Z. A-2

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA108B149 |
| పుస్తకం పేరు | చిరదీప వెలుగులు |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 91 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C1,6 ,bci |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |